సాహిత్య
ప్రస్థానం
అక్టోబర్ 2017
సంపుటి : 16 సంచిక : 10

# అమానుషం, అసహనం

బెంగళూరులో సంచలన సంపాదకురాలు గౌరీ లంకేశ్ దారుణ హత్య దేశాన్ని దిగ్భ్రాంత పరచింది. మతతత్వానికి, విద్వేష కాండకు వ్యతిరేకంగా పోరాడుతున్న గౌరి క్రియాశీలత నచ్చని శక్తులకు కక్షకట్టి ఆమెను కాల్చి చంపేశాయి. అంతకు ముందు ఇదే కర్నాటక రాష్ట్రంలో కల్బుర్గినీ, పక్కనే మహారాష్ట్రలో నరేంద్ర దభోల్కర్, పన్సారే వంటి హేతువాదులనూ హత్య చేసిన రీతిలోనే అత్యంత క్రూరంగా వెంటాడి బలి తీసుకున్నారు. మహారాష్ట్రలో బిజెపి ప్రభుత్వం దర్యాప్తులో ఇప్పటి వరకూ దొరికిన ఆధారాలు సనాతన సంస్థకూ, హిందూత్వ అనుబంధ సంస్థలకూ చెందిన వారిగా తేలింది. అసహన శక్తులు పథకం ప్రకారమే హేతువాదులనూ లౌకిక ప్రజాస్వామిక మేధావులు రచయితలనూ బెదిరించేందుకు ఇలాటి అమానుషాలు చేస్తున్నట్టు అర్థమవుతుంది. గౌరీ లంకేశ్ గత కొన్నేళ్లుగా కర్ణాటకలో మత సంబంధమైన వివాదాల పరిష్కారం కోసం, అలాగే కల్బుర్గి హంతకులను పట్టుకోవడం కోసం ముందుండి పోరాడుతున్న సంగతి అందరికీ తెలుసు. ఈ క్రమంలో కర్ణాటకలో 300 అవార్డులు వెనక్కు ఇవ్వడం దేశమంతటినీ ప్రభావితం చేసింది. అది సహించలేకనే ఆమెపై కక్ష గట్టి హత్య చేశారు. కల్బుర్గి హత్యకు కారకులైన వారినే ఇంతవరకూ పట్టుకోని సిద్దరామయ్య ప్రభుత్వం ఇప్పుడైనా వేగంగా స్పందించి నిందితులను అరెస్టు చేయాలి. దేశంలో హిందూత్వ పేరిట హింసాకాండకు కారణమైన విద్వేషభావజాలం రగిలిస్తున్న సంఘ పరివార్, వారికి అనుకూలమైన కేంద్ర ప్రభుత్వమూ ఇదేదో తమకు సంబంధం లేనిదిగా మాట్లాడ్డం హాస్యాస్పదం. ఈ వాతావరణం దేశమంతా అలుముకోవడం వెనక వున్నది వారేనని అందరికీ తెలుసు.. భావ ప్రకటనా స్వేచ్ఛపైనే గాక పత్రికా స్వేచ్ఛపైన కూడా ఇలాటి దాడి సహించరానిది. దీనిపై ప్రజాస్వామిక శక్తులు తీవ్ర నిరసన వ్యక్తం చేశాయి. ఈ నిరసనోద్యమాన్ని మరింత ముందుకు తీసుకుపోవాలి.

.......

ప్రొఫెసర్ కంచ ఐలయ్య రాసిన ఒక పుస్తకానికి సంబంధించి కూడా తెలుగు రాష్ట్రాల్లో కొందరు నాయకులు, సంఘాలు సాగిస్తున్న బెదిరింపులు హెచ్చరికలు కూడా సరికాదు. ఆయన భావాలతో విభేదించడం, చర్చించడం ఎవరైనా చేయొచ్చు. కాని ఆయనను ఉరితీయాలని, పుస్తకాన్ని నిషేధించాలని ఉద్రిక్తత పెంచడం వేరు. రచయితలపై ఇలాటి బెదిరింపులు అనుమతించరానివి.

కవర్ పెయింటింగ్ : ఆర్టిస్ట్‌మోహన్

బొమ్మలు : తుంబలి శివాజీ, గంగాధర్

## ఈ సంచికలో ...





మనీ ఆర్డర్లు, రచనలు పంపించవలసిన చిరునామా:
ఎడిటర్, సాహిత్య ప్రస్థానం, ఎం.బి. విజ్ఞానకేంద్రం, డో.నెం. 27-30-4, 3వ అంతస్తు, ఆకులవారి వీధి, గవర్నర్‌పేట, విజయవాడ - 520 002, సెల్: 9490099059

హైదరాబాద్ చిరునామా
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్ ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్ - 500 020

ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

# వ్యక్తిత్వం

- డా॥ ఎన్. గోపి



బుద్ధిమంతుడనే పేరు నాకొద్దు
తలవంచుకొని పోతాడని
వీధులు కొనియాడే మెప్పులు నాకొద్దు
ఎవరి తెరువూ పోనివాడు
ఎవరి బరువునూ దించలేడనే
జీవన సత్యం తెలుసుకున్నాను.

వెదురుబద్దలా వొంగుతాను గాని
విల్లుగా మారి
అన్యాయకులపై ఎక్కుపెడతాను.
రెండు చేతులను
చెకుముకిరాళ్లుగా చేసుకొని
నిప్పురవ్వలను వెదజల్లుతాను
దీపాలను ముట్టిస్తాను,
మరుగుతున్న పాలలా
పొంగిపోతాను
పాత్రలో మిగిలినవాటిని
కవిత్వం చేస్తాను

ఎవరి జోలికి పోవద్దురా అని
అమ్మ చిన్నప్పుడు చెప్పేది.
కన్నతల్లి అభద్రతా భారాన్ని
మమకార మహోదధిగా
అర్థం చేసుకునే వయస్సు కాదది.
అడుసు తొక్కొద్దురా అని
పంతులుగారు చెప్తే
పద్మాలను రక్షించటానికని
చెప్తానిప్పుడు.

అందరితో మంచిగా ఉండాలనుకోను
వ్యక్తిత్వాన్ని తీసి గట్టుమీద పెట్టను
బుద్ధిమంతుడినే కాని
బుద్ధిని జ్వాలగా మార్చుకొని జీవిస్తాను.

◆

## సెప్టెంబర్ నెల పురస్కారాలు

**రెక్కల్ని ఎగరనిద్దాం...**
కథకు: రూ.700/-
రచయిత : యస్.వి.యమ్.ఎన్. గాయత్రి

**వాళ్లెప్పుడో చచ్చారురా...!!!?**
కవితకు : రూ .500/-
రచయిత : జి. తిరుపతిరావు

కథ, కవితకు సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కారాల చెక్కులు ఈ రచయితలకు అందుతాయి

పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు.

- ఎడిటర్

# రంగుల ప్రపంచం

వారణాసి భానుమూర్తి రావు
9989073105



స్కోడా కార్‌లో హైటెక్‌సిటీకి వెడుతున్నాను ఏదో పని మీద.

వెనుక సీట్లో శ్రీమతి మా చిన్ని గాడితో కూర్చో నుంది.

చిన్ని గాడి ఏడుపు .

ఏమయింది ? మాటి మాటికీ ఏడుస్తున్నాడు ? కొంచెం అసహనంగా అన్నాను.

మే నెల ఎండలు కాగి పోతున్నాయి. కార్ లో గూడా ఏ సి ఎఫెక్ట్ బాగా ఉంటే గూడా ఉమ్మదంగా ఉంది .

"డైపర్ మార్చాలండి..కొంచెం పక్కకి కార్ ఆపుతారా ?"

"అన్నీ ఇంటిలోనే చూసుకొని రావాలి గదా శశి .... ఏమిటిది ?"

జూబ్లీ హిల్స్ చెక్ పోస్ట్ దగ్గర రెడ్ సిగ్నల్లో అపాను ...బంజారా హిల్స్ నుండి వస్తున్నాను.

అంతలో ఒక ముసలావిడ కొన్ని వస్తువులు అమ్మ జూపుతోంది. అవి కార్ షేడ్ షీల్డ్స్ .. ఎండ ఆపడానికి పనికొస్తాయి.

దీనంగా ఆమె అడుగుతోంది. అమె కళ్ళల్లో దైన్యం , ముఖంలో నీరసం. ఆమె చేతిలో ఆరేడు నెలల పసి కందు. ఎండకో, ఆకలికో గుక్క పెట్టి ఏడుస్తోంది.

శ్రీమతి డైపర్ మార్చడంలో బిజీ గా ఉంది.

"శశి ..కొందామా ..పాపం ఆమెకు హెల్ప్ చేసినట్లు ఉంటుంది" అడిగాను నేను.

శ్రీమతి ఎగిరి గంతేసింది.

"ఛీ పాడు.. వాళ్ళ చేతుల్లో బాక్టీరియా . చూడండి ఆమె ఎలా ఉందో. లక్షణంగా షాపులో కొనవచ్చు గదా"

"ఎంతమ్మా ?" అడిగాను నేను.

"రెండు వందలు బిడ్డా ...ఎంతిస్తారు చెప్పండి ?"

ఆమె ముఖం విప్పారింది ..నేను కొంటానేమో అని

"నూట యాభై ఇవ్వండి సారూ..." అంది

శ్రీమతి విండో గ్లాస్ ఓపెన్ చేసినందుకు తిట్ల వర్షం కురిపిస్తోంది.

"డర్టీ భిక్ష గాళ్ళ దగ్గర కొంటారేమండి..." అంది కోపంగా.

గ్రీన్ సిగ్నల్ పడింది.

"అమ్మా ... వద్దు లే !" అన్నాను.. "సారూ నా బిడ్డ పాలు తాగి రెండు రోజులయ్యింది. నీళ్ల మీదే

బతుకుతున్నాడు." అని ఆమె రెండు చేతుల్తో నమస్కరించి ఏడుస్తోంది .

నా కళ్ళల్లో కన్నీళ్లు సుడులు తిరిగాయి. జోబీలో ఉన్న రెండు వందలు తీసి ఆమెకు ఇచ్చాను .

"సారూ..." అని ఒక కొత్త పాక్ తీసి ఆమె నాకు ఇవ్వ బోయింది.



"నాకు అవి వద్దమ్మా .. ఈ రెండు వందలు పెట్టి పిల్ల వాడికి పాలు, బిస్కట్లు కొని ఇవ్వు" అని కార్ హైటెక్ సిటీ వైపు పోనిచ్చాను.

"మీరు ఇంత పెద్ద జాబ్ చేస్తూ రోడ్ల మీద ఏమిటండీ ఆ కొనుడు? మీకసలు బుద్ధి వున్నదా ?

వాళ్ళ దగ్గర నుండి ఇన్‌ఫెక్షన్స్ వచ్చి రోగాలు వస్తాయి" అంది గట్టిగా అరుస్తూ.

"అనవసరంగా రెండు వందలు వేస్ట్ చేశారు. ఇలాంటి బిక్షగాళ్లు మన దేశంలో కోట్ల మంది ఉన్నారు. ఇలా డబ్బులు పంచుకొంటూ పోతే మన ఆస్తులు అమ్ముకోవాలి।" అంది కాస్త ఉక్రోషంగా .

***

కార్ హొటల్ వెస్ట్ ఇన్ ముందర నిలిపాను.

మా ఫ్రెండ్స్ డాటర్ బర్త్ డే పార్టీ .

"గిఫ్ట్ కొనడం మరచి పోయాం..ఇప్పుడేం చేద్దాం ఎటిఎం పక్కనే ఉంది... పది వేల రూపాయలు డ్రా చెయ్యండి. గిఫ్ట్ కవర్లో పెట్టి ఇస్తాం" అంది శ్రీమతి.

"ఏమిటి .. పది వేలా ??"

"వాళ్లు మన చంటి గాడి బర్త్ డేకి ఇరవై వేలిస్తారు లెండి. మన డబ్బులు ఎక్కడికీ పోవు" అంది శ్రీమతి.

"అక్కడ కార్ సన్ షేడ్స్ కొనడానికి రెండు వందలు వద్దన్నావు. ఇప్పుడు పది వేలు పెట్టడానికి గూడా రెడీగా ఉన్నావు"

శశి ఏమీ మాట్లాడలేదు. కారు దిగి పోయింది. బర్త్‌డే పార్టీ చాలా గ్రాండ్‌గా జరిగింది.

"ఐదు లక్షలు ఖర్చు పెట్టాడట ఆనంద రావు వాళ్ళ అమ్మాయి బర్త్ డే పార్టీకి" అంది శ్రీమతి నా చెవిలో గుసగుసలు పెడుతూ.

ఆశ్చర్యపోయాను. బర్త్‌డే పార్టీకి ఐదు లక్షలు పెట్టే ధనవంతులున్న ఈ దేశంలో పుట్టిన పిల్లలకి పాలు కొనలేని స్థితిలో ఉన్న ఆగర్భదరిద్రులు ఉన్నారు. ఈ దేశంలో సమన్యాయం ఎప్పుడు జరుగుతుంది ?

నాకా రాత్రి నిద్ర పట్టలేదు. మాటి మాటికీ అడుక్కొన్న ఆమె గుర్తుకు వస్తోంది.

***

"శశి ...ఈ రోజు మనము కర్నూలు వెళ్ళాలి. అర్జంటుగా ఆఫీసు పని మీద వెళ్ళాలి" అన్నాను రెండు రోజుల తర్వాత.

"అలాగే మంత్రాలయం వెళ్లి వస్తామా ?" అంది శ్రీమతి.

"ఏమో చూద్దాం" అన్నాను నేను. బ్యాగేజి అంతా సర్దుకొని డిక్కీలో పడేశాను. చంటి గాడికి కావల్సిన వన్నీ శ్రీమతి సర్దుకొని వెనుక సీట్లో పెట్టింది.

కారు రెండు గంటల్లో ఔటర్ రింగ్ రోడ్ మీదుగా జడ్చర్ల చేరింది. టైం పదకొండు గంటలు దాటింది. మిట్ట మధ్యాహ్నం ఎండలు మాడి పోతున్నాయి. రోడ్ల మీద మనుష్య సంచారమే లేదు. నలభై ఐదు సెంటి గ్రేడ్ దాటిందేమో! అన్నాను నేను.

"ఈ దరిద్రపు ఎండల్లో ఏమిటండి ఈ పాడు ప్రయాణం ?" అంది విసుగ్గ శ్రీమతి.

అవును నాకు గూడా అలానే అన్పిస్తోంది. కానీ ఏమి చెయ్యలేను. రాత్రి ఎండి గారు ఫోన్ చేసి కర్నూల్ లో డీలర్స్ కాన్ఫరెన్స్ అటెండ్ కమ్మన్నాడు. కారు జడ్చర్ల దాటి అరవై కిలో మీటర్లు ముందుకు వురికింది.

రోడ్లు మాడి పోతున్నాయి. కారు టైర్లు కరిగి పోతాయేమో అన్న భయం వేసింది నాకు. అనుకొన్నట్లు గానే కారు టైర్ తుస్ అని ఒక్క పెద్ద శబ్దంతో పంచర్ అయిపోయింది.

స్టీరింగ్ బాలన్స్ తప్పి కారు అటు ఇటు కదిలింది పాము లాగా. శ్రీమతి కెవ్వు మని అరచి ఏడుస్తోంది. పిల్లాడు గూడా భయపడి ఏడ్పు ఎత్తుకొన్నాడు. మెల్లగా స్టీరింగ్ కంట్రోల్ చేసి ఒక చెట్టు క్రింద అపాను.

"మీరు టైర్లు సరిగ్గా ఉన్నాయో లేదో తెలుసు కోవాలి గదా ... స్టెప్నీ ఉందా? మార్చడం వచ్చా?" ప్రశ్నలు గాభరాతో వేసింది శశి.

కారు డోర్ వెనుక తెరచి చూసాను. "ఓహ్ మై గాడ్ స్టెప్నీ లేదు"

భయంతో కాళ్ళలో వణుకు పుట్టింది నాకు. "మళ్ళీ జడ్చెర్లకి వెళ్లి ఈ కార్ టైర్ తీసుకెళ్ళి పంచర్ వేసుకొని

మెకానిక్‌తో రావాలి. కనీసం ఇంకా మూడు గంటలయినా పడుతుంది." అన్నాను నేను.



శ్రీమతి ముఖంలో భయం .. ఏడుపు..

బయటికి వచ్చి చెట్టు క్రింద పిల్లాడితో నిలబడింది. మొబైల్ తీసుకొని ఎండి గారికి ఉన్న విషయం చెప్పాను. ఆయన ఏమైనా అంటాడేమో అని భయం వేసింది నాకు. సరే కర్నూల్‌లో ఉన్న జోనల్ మేనేజర్‌ను అటెండ్ కమ్మని చెప్పారు ఎండి గారు. బ్రతుకు జీవుడా అని జోనల్ మేనేజర్‌కి ఫోన్ చేసాను.

"నీళ్లు లేవు. పాలు లేవు త్రాగడానికి ... ఇప్పుడెలా . కర్నూలులో అన్నీ దొరుకుతాయన్నారు.. ఎక్కువ పెట్టుక రాలేదు నేను" అంది శ్రీమతి గాబరాగా.

అంతలో అక్కడున్న గుడిసెలోంచి ఒక ఆసామి వచ్చాడు. అతను అరవై సంవత్సరాల దాటిన ముసలాయన. చినిగి పోయిన బనీను, లుంగీ, తలపాగాతో వున్నాడు.

"ఏమి సారూ .. ఏమయ్యింది" అడిగాడు అతను.

కథంతా చెప్పాను.

"తమరికి ఫికర్ అక్కర లేదు.. నా మనమడు ఉన్నాడు. ఆడు అంతా సూసు కొంటాడు. పరేషాన్ వద్దు. రండి నా గుడిసెలోకి" అన్నాడు ఆ తాత. గుడిసెలోకి వెళ్ళగానే పాచిపోయిన అన్నం వాసన వస్తోంది.

"నీళ్లు త్రాగండి" అని ఒక ముంతలో నీరు నింపి ఇచ్చాడు. నేను గడ గడ మని నీళ్లు త్రాగేశాను. శ్రీమతి తాగ లేక పోయింది. అయినా తప్పలేదు. ఆ నీళ్ళే తాగింది. అక్కడున్న మేక దగ్గరికి వెళ్ళి మేక పాలు అప్పుడు పిండి, పిల్లాడికి తాపమని చెప్పాడు ఆ పెద్దాయన. అలాగే ఇష్టం లేక పోయినా తప్పదన్నట్లు చేసింది తాను.

ఎప్పుడు చేసినవో గాని ఆరేడు జొన్న రొట్టెలు, గొడ్డు కారం మా ముందు ఉంచాడు. ఆకలి అవుతోంది గదా నేను మా శ్రీమతి అవి మొత్తం లాగించేశాము. అప్పుడు నా శ్రీమతికి బాక్టీరియా, అపరిశుభ్రత, ఇన్‌ఫెక్షన్స్ గుర్తుకు రాలేదు.

"మీరు కాస్త ఈ నులక మంచం మీద పడుకోండి దొరా .. మా మనమడు ఈ పని సక్క బెట్టు కొనివస్తాడు" అన్నాడు ఆ పెద్దాయన. వాళ్ళ మనమడు మోటార్ బైక్‌లో వచ్చాడు. నా కార్ వీల్ తీసుకొని జడ్చెర్లకి వెళ్లి రెండు గంటల్లో రిపేర్ చేసుకొని వచ్చి టైర్ వేసి అతనే బిగించాడు.

"ఇక మీరు ఆరాంగా ఎల్లండి" అన్నాడు పెద్దాయన.

పెద్దాయన చేతిలో ఐదు వందలు పెట్టబొయ్యాను. పెద్దాయన గాని, మనమడు గాని ఒక్క పైసా గూడా ముట్టలేదు. బ్రతుకు జీవుడా అంటూ కారు మళ్ళీ వెనక్కి తిప్పి హైదరాబాద్ వైపు మళ్లించాను. ఇల్లు చేరేసరికి రాత్రి తొమ్మిది గంటలయింది.

***

రెండు రోజుల తరువాత...

శ్రీమతి ఆ సంఘటన తరువాత చాలా ముభావంగా ఉంది. ఏమి మాట్లాడం లేదు. ఏదో ఆలోచిస్తూ చాలా బాధగా ఉంది. ఆ రోజు సాయంకాలం మళ్ళీ మేము జూబిలీ హిల్స్ చెక్ పోస్ట్ దగ్గర ఆగాం.

మళ్ళీ ఆమె ప్రత్యక్షమైయింది.

"కార్ షేడ్స్ .. బిడ్డ కొనుండ్రి" అనింది.

ఆమె చేతిలో పిల్లవాడు ఏడుస్తూ ఉన్నాడు. శ్రీమతి కారు డోరు తెరిచి తన చేతిలో ఉన్న ఒక్క పాకెట్ ఇచ్చింది.

"మా బాబు బట్టలు ఉన్నాయి.. ఇంకో పాకెట్లో నా చీరలు ఉన్నాయి.. తీసుకో అమ్మ.." అని ఆమె చేతిలో వంద రూపాయలు పెట్టింది నా శ్రీమతి. మరుసటి రోజు రెండు గిన్నెలు నిండా పులిహోర, పెరుగన్నం తీసుకొని పక్కనున్న గుడిలో అక్కడ అడుక్కొన్న వాళ్ళకి పంచి పెట్టి వచ్చింది.

మా శ్రీమతిలో వచ్చిన ఈ మార్పు చూసి నేను చాలా సంతోషించాను.

ఆ రోజు రాత్రి "శశి .. నీలో ఏదో మార్పు కొట్టొచ్చినట్లు కన్పిస్తోంది" అని అడిగాను. శ్రీమతి కళ్లలో కన్నీళ్లు ధారాపాతంగా వర్షిస్తున్నాయి.

"కార్ ఏసీలో కూర్చొని, నీలి అద్దాల్లో ఇదే ప్రపంచాన్ని చూస్తే ఏడు రంగుల సినిమాలా కన్పించేది నాకు. కానీ ఒక్కసారి క్రిందకు దిగి చూస్తే నిజమైన బాధల ప్రపంచం కనపడింది. ఆ పెద్దాయన, ఆయన మనమడు చూపిన త్యాగం నన్ను , నా జీవితాన్ని మార్చి వేసిందండి." అంది నా భుజాల మీద వాలిపోతూ.

చిన్న పిల్లలా ఏడుస్తున్న నా శ్రీమతిని సముదాయించడానికి నాకు చాలా కష్టమైంది .



# మోహన్ జ్ఞాపకాలలో....

- తెలకపల్లి రవి

నేను కృష్ణశాస్త్రి చాలా సార్లు కలుసుకున్నాం. కాని ఎంత బాగా పద్యాలు రాశారు అని నేను అనలేదు.. ఎంతమంచి కవితలు రాశారు అని ఆయనా అనలేదు. అనకపోవడంలోనే అనడం వుంది.. అంటూ శ్రీశ్రీ నివాళు లర్పిస్తారు. ఆ స్థాయిని పక్కనపెడితే.. నిజంగానే మనం చాలా అభిమానించేవారిని కూడా పలానా రచన బాగుందనో సృజన బాగుందనో ప్రసంగం బాగుందనో తప్ప మొత్తంగా వ్యక్తిగత పాత్రను లేదా కంట్రిబ్యూషన్ పట్ల గౌరవాన్ని చెప్పే అవకాశం వుండదు. కాని మోహన్ విషయంలో మాత్రం నాకు అలాటి అరుదైన అవకాశం కల్పించారు విజయవాడ మిత్రులు. 2015 లో ఆయనకు అభినందనలాటిది ఏర్పాటు చేసి ముఖ్యప్రసంగం చేసే వీలు కలిగించారు. మోహన్ పట్ల నా గౌరవాన్ని ఆయన ప్రత్యేకతలను ఆరోజు మనస్ఫూర్తిగా తృప్తిగా చెప్పాను. అంతటి హాస్య వ్యంగ్య సామ్రాట్ కూడా మాటలు(వెర్బాసిటీ) అసలు ఇష్టపడరు. నాలాటి నిరంతర వ్యాఖ్యాతలపట్ల ఒకింత వైముఖ్యం కూడా వుండటం సహజం. ఆ రోజు నేను మాట్లాడిన వెంటనే మోహన్ స్పందిస్తూ రవిగారు ఇప్పటికే నన్ను చాలా ఎంబ్రాస్ చేశారు. ఇతరులు మళ్లీ పొగిడే పని పెట్టుకోవద్దని హెచ్చరించారు. చాలాసేపు గడిపాం. అనేక బృందాలతో ఫోటోలు తీసుకున్నాం.. అందులో ఒకటి నెట్‌లో దొరకడంతో ఈ మాటలు చెప్పాలనిపించింది. ఆయనతో దాదాపు ఒక దశాబ్దం పాటు చాలా దగ్గరగా గడిపాను. ప్రజాశక్తి బుక్‌హౌస్ కేంద్రంగా తరచూ కలిసేవాళ్లం. మా టైటిల్స్ వేసిపెట్టడమే కాదు, అనేక ఐడియాలు ఇస్తుండేవారు. ఉత్సాహంగా వాటిని అమలు చేశాం. అప్పుడే తెలంగాణ పోరాటంపై సునీల్ జేనా చిత్రాలు తెప్పించి ఎగ్జిబిషన్ పెట్టాం.వాటినే తర్వాత ఆల్బంగా వేశాం. అప్పటికి ఆ పోరాటానికి 65 ఏళ్లు! సాహిత్యశాల, జన కవనం వంటి

### ప్రసిద్ధ చిత్రకారుడు

## మోహన్ కన్నుమూత

ప్రసిద్ధ చిత్రకారుడు తాడి మోహన్ సెప్టెంబర్ 21న హైదరాబాద్‌లో కన్నుమూశారు. పశ్చిమగోదావరి జిల్లా ఏలూరులో డిసెంబర్ 24, 1951న మోహన్ జన్మించారు. 1970లో విశాలాంధ్రలో పాత్రికేయ వృత్తిలోకి ప్రవేశించిన మోహన్ వివిధ పత్రికల్లో పనిచేశారు. చిత్రకారుడిగా, కార్టూనిస్టుగా మోహన్‌ది విలక్షణ శైలి. ప్రత్యక్షంగా, పరోక్షంగా ఎందరో చిత్రకారుల్ని ప్రభావితం చేశారు. వ్యంగ్య చిత్రాల్ని గీయడంలో మోహన్‌ది ప్రత్యేకమైన శైలి. ఆయన కార్టూన్‌లు తెలుగునాట సుపరిచితం. పొలిటికల్ కార్టూనిస్టుగా తెలుగు పత్రికా రంగంపై మోహన్ ప్రభావం అధికం. దేవీప్రియ, మోహన్ కలిసి సంయుక్తంగా 'రన్నింగ్ కామెంట్రీ' కాలమ్ నిర్వహించారు. యువకార్టూనిస్టుల కోసం ఉదయం వారపత్రికలో కార్టూన్ కబుర్లు పేరుతో శీర్షికను నడిపించారు. ఆంధ్రప్రభలో 'రాత-గీత' పేరుతో సుబ్బారావుతో కలిసి కాలమ్ నిర్వహించారు. సాహితీస్రవంతి నిర్వహించిన సాహిత్యశాల, కార్యశాల, జనకవనం వంటి కార్యక్రమాలకు బ్యాక్‌డ్రాప్ చిత్రాలను మోహన్ అందించారు. అరుదైన చిత్రకారుడు మోహన్‌కు సాహితీస్రవంతి, సాహిత్య ప్రస్థానం తరపున జోహార్లర్పిస్తున్నాం.



## కవిత

# ప్రశ్నార్థకపు వాన!



ఉత్తరపు ఆకాశాన
ఆశా సౌధం వలె మబ్బు నిలబడింది
కురవనా వద్దా అని !

పడమటి కొండల్లోని సూరీడు
శూన్యతా శిఖరాల చాటున
ఎన్ని పగళ్ళు ఎన్ని రాత్రుళ్ళు
నిద్రలేని తనంతో గడిపాడో ధరణి విస్తుబోయేట్టు !!
ఊరి చుట్టూ ఎన్ని అందాలు విరబూస్తున్నా
జ్ఞాపకం వుందా నేస్తం, చరిత్ర చెప్పే సత్యం ?

ఎండిపోయి బీటలు, చరిత్ర నేల పగుళ్ళు
కూలిపోయి పిచ్చి చెట్లు మొలిచిన ఫ్యాక్టరీ గూళ్ళు

కృంగిపోయి గతుకులు మిగిల్చిన రోడ్లు
గ్రామాలని తల్లి స్తన్యం నుంచి వేరు చేసిన మారీచులు
మళ్లె
తల్లడిల్లి పోయేలా చేసి,
చెరువులు చెరబట్టి,
కుంటలలో ఇటుక బట్టీ పెట్టి
నేల చెరుగులో ఏ మూల చూసినా చిన్నారి గ్రామం
మానప్రాణాలు పణంగా పెట్టిన ఛాయలే !
కరెంటుకు విడిచిన అశువులు, నీటికి తపించిన గొంతులు
గ్రానైటు కొండలను పిండి చేసి
ఊరి మీదికి ఉసిగొల్పి....
చెట్టూ చేమల్ని నేలరాల్చి...
బీడు నేలలు నాగేటి చాళ్ళని మరిచి
ఎన్ని యుగాలైందో !
కూలిపోయిన మంచెల మీంచి
వడిసెల రాయిలాంటి
పాట.... రాత్రిపూట....
రైతు గుండెను గాయపరుస్తూనే వుంది !
ఎవరు నిర్మించారో గ్రామ స్వరాజ్యాన్ని
ఎవరు నిర్మూలించారో ఊరి స్వరూపాన్ని
మరణపు సరిహద్దులన్నీ చెరిపేసి
స్మశానాన్ని మనిషి గుండెల్లో
ఖరారు చేసి బ్రతకమని !
కురిసే మబ్బు కూడా జాడలు తీస్తోంది
వానిస్తే ఊరు నాకేమిస్తుందని?
నిశ్శబ్దానికి అవతల మిగిలిపోయిన
ఋతువుని తిరిగి
మనుషుల్లో ప్రవేశపెట్టడం కోసం
మూలాలు వెతుక్కుంటున్న శిశుత్వపు
చినుకు మబ్బై వచ్చింది
వాన కురవనా వద్దా అని !!! ◆


- తమ్మెర రాధిక
9440626702


---

వాటికి మోహన్ వేసిన లోగోలు, చిత్రాలు ఇప్పుడు చాలా పుస్తకాల టైటిల్స్‌గా కనిపిస్తుంటాయి. పనిఒప్పుకుంటే మోహన్ చాలా తప్పకుండా చేసేవారు. కాకపోతే ఆ తిరుగుడూ తీసుకురావడం వంటి తంటాలన్నీ మా లక్ష్మయ్య చూసుకునేవారు. మేమూ మోహన్ పని ఏదైనా వచ్చినా వెంటనే చేసి పెట్టేవాళ్లం.

మాకు ప్రత్యేకించి నాకు ఓ కోరిక వుండేది. శ్రీశ్రీ, తిలక్, జాషువా వంటి వారి ప్రసిద్ధ చరణాలకు చిత్ర రూపం ఇచ్చి ప్రచురించాలని. ఆ పని కూడా మోహన్ చాలా ఇష్టంగా చేశారు. అలా వచ్చినవే అలలు.. కలలు.. పూల కెరటాలు,, చైతన్య తరంగాలూ ఇంకా ఎన్నెన్నో. మోహన్ దేన్నీ ఎవరినీ అంత తేలిగ్గా నమ్మరు. కాని వదలరు. ప్రేమిస్తారు. కాని విమర్శిస్తారు. ఆయన కార్యాలయం ఒక కళాలయమే.. ఇంకా దువ్వూరి రామిరెడ్డికి ఆత్రేయ చేసిన సవరణ కలిపితే 'పురాతన పానశాల' కాకపోతే కళా పిపాస తీర్చే చలివేంద్రం. చాలాసార్లు అక్కడికి వెళ్లి గంట గంటన్నర మాట్లాడి కూడా అసలు సమయానికి వచ్చేసేవాణ్ని. ఒక్కసారి మాత్రమే ఎక్కువ సేపున్నాను. అప్పుడు మోహన్ అక్కడ తన యువ మిత్రులెవరినో జానపద గీతం పాడమన్నారు. వారు పాడారు ఆడారు గాని ఆయనకూ వాళ్లకూ కూడా తృప్తి కలగలేదు. ఇక్కడ సివిలైజ్డ్ ఆడియన్స్ వున్నారు గనక పండటం లేదు అన్నారు. నేను నెమ్మదిగా నిష్క్రమించాను. ముంబాయిలో ప్రపంచ సామాజిక వేదిక మహాసభల దగ్గర కలిశాము. మోహన్ శాంతి ఉద్యమ చిత్రాల ప్రదర్శన పెట్టారు. అక్కడ హడావుడి తక్కువ గనక ఎక్కువ సేపు మాట్లాడుకున్నాం. ఆయన పనిమంతుడు. ప్రతిభావంతుడు. నిబద్ధుడు, నిపుణుడు. నలిగిపోతూ కూడా నవ్వించిన వాడు.. కొన్ని తరాల తెలుగువాళ్లకు సమరశీలత అంటే మోహన్ రేఖల్లోనే సాక్షాత్కరిస్తుంది. ఇంతకంటే ఎక్కువ రాస్తే ఆయన క్యారికేచర్స్ తిరుగుబాటు చేస్తాయని నాకు తెలుసు. ◆

# ప్రపంచీకరణ చట్రంలో 'నేతన్న'



- నీలం వెంకటేశ్వర్లు
9502411149

*అది మేక వన్నె పులి అని గ్రహించేలోపే మన ఇంటిని, మన వృత్తులను చివరకు మనల్ని కూడా ఛిన్నాభిన్నం చేసేసింది. ఆ మేకతోలు కప్పుకున్న పులి 'ప్రపంచీకరణ'. ఈ ప్రపంచీకరణ పదం సాంఘిక శాస్త్రాలలో 1960లలోనే ఉపయోగించబడింది. అయితే ఆర్థికవేత్తలచే 1980 నుండి అది మరింత వ్యాప్తిలోకి వచ్చింది. చార్లెస్ రుస్సేల్ అనే ఒక అమెరికన్ వ్యాపారవేత్త 1987లో ప్రపంచీకరణను 'వాణిజ్య భూతాలు' అని వ్యాఖ్యానించాడంటే ప్రపంచీకరణ స్వరూపం ఎలాంటిదో అర్థం చేసుకోవచ్చు.*

ఇవాళ మనం అడక్కుండానే మన ఇంటిని చక్కదిద్దటానికే అంటూ మన నట్టింట్లోకి అడుగు పెట్టింది. అది మేక వన్నె పులి అని గ్రహించేలోపే మన ఇంటిని, మన వృత్తులను చివరకు మనల్ని కూడా ఛిన్నాభిన్నం చేసేసింది. ఆ మేకతోలు కప్పుకున్న పులి 'ప్రపంచీకరణ'. ఈ ప్రపంచీకరణ పదం సాంఘిక శాస్త్రాలలో 1960లలోనే ఉపయోగించబడింది. అయితే ఆర్థికవేత్తలచే 1980 నుండి అది మరింత వ్యాప్తిలోకి వచ్చింది. చార్లెస్ రుస్సేల్ అనే ఒక అమెరికన్ వ్యాపారవేత్త 1987లో ప్రపంచీకరణను 'వాణిజ్య భూతాలు' అని వ్యాఖ్యానించాడంటే ప్రపంచీకరణ స్వరూపం ఎలాంటిదో అర్థం చేసుకోవచ్చు.

ఈ ప్రపంచీకరణ భావజాలాన్ని, దాని నిజస్వరూపాన్ని గ్రహించిన ఎందరో సాహితీవేత్తలు ప్రపంచీకరణ విధానాలను వ్యతిరేకించారు. అయితే ఈ విధానాలను సమర్థించేవారు లేకపోలేదు. ఏది ఏమైనా ఈ ప్రపంచీకరణ వల్ల సమాజానికి లాభాల కంటే నష్టాలే ఎక్కువగా ఉండటంతో చాలా మంది సాహితీవేత్తలు దీనిని వ్యతిరేకిస్తున్నారు. దీని స్వరూప స్వభావం అందరికీ అర్థమయ్యేలా నిర్వాచనాలనూ ఇచ్చారు. ప్రముఖ సాహితీ విమర్శకులు ఆచార్య మేడిపల్లి రవికుమార్ "ప్రపంచ దేశాలలోని మానవ జాతులన్నీ ఒక జాతిగా, ఒక దేశంగా, ఒక రాష్ట్రంగా, ఒక ప్రాంతంగా, ఒక జిల్లాగా, ఒక మండలంగా, ఒక గ్రామంగా, ఒక కుటుంబంగా ఒకే ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక ఛత్రం కింద కలిసి జీవించే పద్ధతే ప్రపంచీకరణ" అని నిర్వచనం ఇచ్చారు.

ప్రపంచీకరణకు కవులు కూడా నిర్వచనాలు ఇచ్చారు. వీరు తమ కవిత్వం ద్వారా ప్రపంచీకరణ అంటే ఏమిటో సామాన్య పాఠకునికి సైతం అర్థమయ్యేలా తెలియపరిచారు. అలాంటి ఒక నిర్వచనాన్ని మనం ఎండ్లూరి సుధాకర్ కవిత్వంలో చూద్దాం.

ప్రపంచీకరణ అంటే ఏమిటీ, ఎక్కడుంది, ఏదీ చూపించమని

**నా అమెరికా మిత్రుడడిగాడు/ నిండు గోదారి పక్కన**
**నీళ్ళ పొట్లాలమ్ముకుంటున్న పసిబాలుణ్ణి చూపించాను/**

***కొబ్బరి బోండాలమ్ముకుంటూ కోకోకోలా తాగుతున్న/ కోనసీమ కొబ్బరి వ్యాపారిని చూపించాను/ పెరుగు పాలు అమ్మేక పెప్సీ సేవిస్తూ/ సెల్లు మాట్లాడుతున్న చల్లనమ్మనీ చూపించాను***

> ***వ్యవసాయం తర్వాత ఎక్కువ విధ్వంసానికి గురైన వృత్తి చేనేత. అందుకే గాంధీజీ వ్యవసాయం, రాట్నం కవల పిల్లలు వంటివి అంటాడు.***

అంటూ కవి ప్రపంచీకరణ నిజ స్వరూపాన్నీ, అది మన జీవితాలలో పాలునీళ్ళలా ఎలా కలిసిపోయిందో మన కళ్ళకు కట్టినట్లు చూపించాడు.

ఈనాడు ఈ ప్రపంచీకరణ, సరళీకరణ ఆర్థిక విధానాల వల్ల దేశంలో వ్యవసాయం తర్వాత ఎక్కువ విధ్వంసానికి గురైన వృత్తి చేనేత. అందుకే గాంధీజీ వ్యవసాయం,రాట్నం కవల పిల్లలు వంటివి అంటాడు. ఒకనాడు బ్రిటీష్‌వారి గుండెల్లో తిరిగిన రాట్నం, స్వాతంత్ర్యసంగ్రామంలో మనల్ని ఏకం చేసిన రాట్నం, ఇవాళ దాన్నే నముకున్న చేనేత కార్మికుల కడుపు నింపలేక పోతుంది. ఈ ఆకలి మంటలు ఈ రోజువి కాదు. 19వ శతాబ్దిలో ప్రారంభమైన పారిశ్రామిక విప్లవంతోనే నాంది పలికింది. మరయంత్రాల సాలెగూటిలో చిక్కుకుని విలవిల్లాడుతున్న నేత కార్మికుల దయనీయ స్థితిని చూసి ఎందరో కవులు తమ కలాల ద్వారా స్పందించారు.

చేనేత కార్మికుని గత వైభవాన్ని రాధేయ తన 'మగ్గం బతుకు'లో ఇలా గుర్తు చేసుకుంటాడు.

***ఆరు గజాల నేత చీరెను/అగ్గి పెట్టెలో అందంగా మడతబెట్టి /అంతర్జాతీయ కీర్తిని/ తలదాల్చిన చేనేత కళాకారుడు/ నేడు జానెడు పొట్టను/ పిడికెడు మెతుకులతో/ నింపుకోలేని దౌర్భాగ్యుడైనాడు***

చేనేతల జీవితాలలోని విషాదాలను ఏకంగా ఒక కావ్యంగా మలచగలిగాడు. తన చేతులలోని కళాత్మకతను వస్త్రాలపై ప్రదర్శించి దేశ విదేశాలలో గొప్ప కీర్తిని పొందారు. కాని నేడు అవే చేతులు అన్నమో రామచంద్ర అంటూ వేడుకొంటున్నాయి. ఒకనాడు ఎంతో కళాత్మకంగా జీవించిన చేనేత కార్మికులు ఈనాడు ఆకలికి అలమటించేంత దుర్భర జీవితంలోకి నెట్టి వేయబడ్డారన్నది సత్యం.

అటు ప్రకృతిని, ఇటు మనిషి చిత్రాలను కూడా సమానశైలిలో నేతలో చూపెట్టే అపురూప కళాకారుడు నేతన్న. ఎప్పుడైతే వారి బతుకులలోకి పవర్‌లూమ్ ప్రవేశించిందో అప్పుడే వారి బతుకులు అతకని పోగులుగా మారాయి. మిల్లుబట్టల ఆధిపత్యంతో నేడు చేనేత ప్రశ్నార్థకంగా మారింది. జీవనోపాధిని పోగొట్టుకొని మగ్గాలనే ఉరికొయ్యలుగా చేసుకుంటున్నారు. కష్టాలు, కన్నీళ్ల కలబోతగా అయింది నేతన్న జీవితం. ఈ తీరుకు కలత చెందిన కవులు సాహిత్యంలో వారి కష్టాలకు స్థానమిచ్చి చేనేత కార్మికుల పక్షం వహించారు. ఇందుకు నిదర్శనం భగ్వాన్ 'విరిగిన మగ్గం' అనే కవిత.

***ఎవరి కోసమో/ చిగురు మెత్తని పట్టుచీర నేస్తూ/ అతను కలగనే ఉంటాడు/ తన కూతురి పెళ్ళికీ ఇలాంటి చీరే నేయాలని/ ఎవరి కోసమో/ సీతాకోక రెక్కల రంగుల శాలువా నేస్తూ/ అతను కలగనే ఉంటాడు/ తన ముసలి తండ్రి భుజాలపైకి ఇలాంటిదే ఒకటి/ ఎప్పటికైనా నేయాలని/ కానీ ఎప్పటికీ కలగని ఉండదు/ తన కోసం తానే / ఒక ఉరితాడు నేయాల్సి వస్తుందని***

.... .... ....

***ఉరికొయ్యో/ పురుగుమందో/ ప్రపంచీకరణ మహమ్మారి ఊపిరాడని బలవంతపు కౌగిలో/ ఏదైతేనేం/ వాడు గిలగిలా కొట్టుకొని చనిపోయాడు (బల్లకట్టు కవితాసంపుటి, పుట-88)***

నేతన్నల కలల ప్రపంచాలు ఎలా ఛిద్రమవుతున్నాయో దృశ్యీకరించిన కవిత ఇది. కవితలో పాఠకున్ని అలా సాఫీగా ముందుకు నడిపిస్తాడు కవి. "కానీ ఎప్పటికీ కలగని ఉండదు, తన కోసం తానే, ఒక ఉరితాడు నేయాల్సి వస్తుందని" అన్న ఈ కవితా పాదాలతో ఒక్కసారిగా పాఠకున్ని షాక్‌కు గురిచేస్తాడు భగ్వాన్. ఈ షాక్ నుంచి తేరుకునే లోపే వారి ఆత్మహత్యలు గల కారణాలు తర్వాతి పాదాలలో పాఠకునికి కనిపిస్తాయి. ఇలా ఈ కవితలోని చేనేతల దయనీయస్థితి మన హృదయాలను బరువెక్కిస్తాయి.

చేతి కొనవేళ్ళలో శ్రామిక జీవన సౌందర్యాన్ని నింపుకొన్న గొప్ప కళాకారుడు చేనేత కార్మికుడు. ప్రాచీన కవుల కవిత్వంలో కీర్తిపతాకంతో కనిపించిన నేతగాడు, నేటి ఆధునిక కవిత్వంలో శిరస్సుల్లేని శిల్పంలా కనిపిస్తున్నాడు. నాటికీ, నేటికీ నేతన్నల జీవితాలలో వచ్చిన తేడాకు కారణాలేమిటో కొండ్రెడ్డి వెంకటేశ్వరరెడ్డి 'జీవముడిగిన జరీపోగులు' కవితలో ఇలా ఆవిష్కరించాడు.

***నూలు పోగు జాలి చూపులకు/ కందె కన్నీళ్ళకు/ మగ్గం***

***మనోవ్యథకు మనసు కరిగి/ 'నేత'నే తలరాతగా భావిస్తూ/ అప్పులతో అవమానాలతో/ ఆత్మహత్యలైపోతున్న అమాయకులు వాళ్ళు/ విఫణివీధి మోసం/ పాలకుల నిర్లక్ష్యం/ వెన్నువిరిచి మన్ను కరివించినా/ బలాత్కార మరణాన్ని ఒకచరిత్రచేసి/ వృత్తి నైపుణ్యాన్ని అంతర్జాతీయ అల్లెపై నిల్పి/ జీవముడిగిన జరీపోగులు వాళ్ళు*** (అతని రాకకోసం కవితాసంపుటి, పుట-100)

> ఒక్క చేనేతనే కాదు, ఈనాడు ప్రతి కులవృత్తి విధ్వంసం వెనుక ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రజల భాగస్వామ్యం కూడా ఉందనే నిజాన్ని కవి గ్రహించాడు.

నేటి కాలం నేతన్నలకు కల్లోల కాలం. ఎందుకంటే కుటుంబ పరిశ్రమగా ఉన్న చేనేత, నేడు వ్యాపార పరిశ్రమగా మారిపోయింది. పారిశ్రామిక విప్లవంలో భాగంగా అంతర్జాతీయ మార్కెట్లు మన దేశంలో ప్రవేశించాయి. వెంటనే చేతి మగ్గాల స్థానంలో మర మగ్గాలను ప్రవేశపెట్టారు. దీంతో నేతన్నల తలలపై అప్పుల రాతలు రాయబడ్డాయి. ఆదుకోవాల్సిన పాలకులు కూడా చేనేత కార్మికులపై నిర్లక్ష్యంగా వ్యవహరించటం వల్ల చేనేత కార్మికుల జీవితాలు మరింత సంక్షోభంలోకి నెట్టబడ్డాయి.

ఇన్ని ఒడిదుడుకుల నుంచి గట్టెక్కడానికి వలసలో, ఆత్మహత్యలో పరిష్కారం కాకూడదు. బతకడం మనకు రాజ్యాంగం కల్పించిన హక్కు. ఆ హక్కును ఎలా పొందాలో 'నేతన్న' అనే కవితలో తిరునగరి ఇలా చెప్తాడు.

***అందుకే/ ఈ వేళ/ ప్రశ్నించు ప్రభుత్వాన్ని/ ప్రశ్నించు సమాజాన్ని/ ప్రశ్నించు మేధావుల్ని/ ప్రశ్నించు అన్యాయాన్ని/ నేతన్నా !/ నిటారుగా నిలువు/ నిన్ను పాలించే వాళ్ళని/ నిలదీసి అడుగు*** (చేనేత కవితా సంకలనం, పుట-34)

కవి చెప్పిన మాటలు అక్షర సత్యాలు. తన దీన స్థితికి తననే నిందించుకునే వైఖరి నుంచి చేనేత కార్మికులు బయటపడాలి. తమ కష్టాలకు కారణమవుతున్న వారిని ప్రశ్నించటం నేర్చుకోవాలి. ప్రశ్నించే తత్వమే జీవించటం నేర్పుతుందనే వాస్తవాన్ని గ్రహించాలి. నేతన్నల పోరాటానికి ప్రశ్నే ఆయుధం కావాలి అంటాడు కవి. ఇలా చేనేత కార్మికులలో ఆత్మవిశ్వాసాన్ని, ధైర్యాన్ని నింపే కవిత్వాన్ని పాఠకులకు అందించారు తిరునగరి.

చేనేత కార్మికులు అంధకార జీవితం నుంచి బయటపడాలంటే మార్పు కేవలం పాలకులలోనే కాదు. ప్రజలలో కూడా మార్పు రావాలని అశోక్ అవారి 'మాన వస్త్రం' అనే కవితలో

***దేశమంతా 'నేత' మయం కావాలంటే../ మరో సహాయ నిరాకరణమే అక్కర్లేదు/ ప్రతి హృదయంలో.../ కాసింత చేనేత సంస్కారముంటే/ చాలేమో !*** (సాహిత్య ప్రస్థానం సెప్టెంబర్ సంచిక,2016, పుట-33)

కవి చెప్పిన మాటలో వాస్తవం లేకపోలేదు. ఒక్క చేనేతనే కాదు, ఈనాడు ప్రతి కులవృత్తి విధ్వంసం వెనుక ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రజల భాగస్వామ్యం కూడా ఉందనే నిజాన్ని కవి గ్రహించాడు. ఎందుకంటే ప్రపంచీకరణ ప్రభావం ప్రజలపై అంతగా అల్లుకుపోయింది. ఎన్నో ఆటుపోట్లు ఎదురవుతున్నా ఇప్పటికీ చాలా మంది చేనేత కార్మికులు తమ వృత్తిపైనే ఆధారపడి బ్రతుకీడుస్తూనే ఉన్నారు. మనం మాత్రం మార్కెట్లలోని విదేశీ దుస్తుల మోజులో పడి మన కళ్ళను మనమే పొడుచుకుంటున్నాం. ఈ ప్రభావం నుంచి మనం బయటపడినప్పుడే మన చేనేతరంగం పునరుజ్జీవనం పోసుకుంటుంది. అప్పుడే వాటి మీదనే ఆధారపడి జీవించే వారి నోట్లోకి నాలుగు వేళ్ళు దిగుతాయి.

ఇలా కవులు, రచయితలు నేతన్న పక్షం వహించి, వారి కష్టాలను ప్రభుత్వాలు, సమాజం గుర్తించేలా తమ సాహిత్యం ద్వారా కృషి చేస్తున్నారు. ఇప్పుడిప్పుడే చేనేత రంగంపై పాలకులు దృష్టి సారిస్తున్నట్లు కనిపిస్తుంది. చేనేత కార్మికులను ప్రోత్సహించాలనే సంకల్పంతో, ఆగష్టు 7వ తేదీకి గల చారిత్రక నేపథ్యాన్ని దృష్టిలో ఉంచుకొని ఆరోజును జాతీయ చేనేత దినోత్సవంగా ప్రకటించారు. ఇది ఆహ్వానించదగిందే అయినప్పటికీ చేతలలో చిత్తశుద్ధి కొరవడితే ఎలాంటి ప్రయోజనం ఉండదు. చేనేత వస్త్రాల పట్ల ప్రజలలో అవగాహన కల్పిస్తూ, వాటిని ధరించేలా ప్రోత్సహిస్తూ అనేక కార్యక్రమాలు చేపడుతున్నారు. అంతటితో ఆగకుండా చౌకధరలకు ముడిపదార్థాలు సరఫరా చేయడం, పన్నులలో మినహాయింపులు ఇవ్వటం, మార్కెటింగ్ సౌకర్యాలు కల్పించడం వంటి చర్యలు చేనేతకు చేయూతనిస్తాయని చెప్తున్న ఆ రంగం నిపుణుల అభిప్రాయాలను పరిగణలోకి తీసుకొని కృషి చేయాల్సిన అవసరం ఉంది. అలాగే నేతన్నకు చేయూతనివ్వాల్సిన బాధ్యత పాలకులపైనే కాదు మనందరిపైనా ఉందనే సత్యాన్ని గ్రహించాలి.

## సుదీర్ఘ నిశ్శబ్దంలో

- పాయల మురళీ కృష్ణ
9441026977



సుప్తావస్థ మీద
చన్నీళ్ళు చిలకరించిన మట్టివృత్తాల చేతులు
హరిత శ్వాసల్ని పసుపుతో ముద్దగా నూరి
ముఖానికి జీవాన్ని నింపేవి ...

ఏ సుదీర్ఘ నిశ్శబ్దానికి
ఎన్నెన్ని పెదవులు కారణమౌతాయో....
అనుకోనివేళ
వెళ్ళిపోయిన సన్నాయి మేళాన్ని
మళ్ళీమళ్ళీ ధ్వనించే తోరణాల దారులకి దూరంగా
ఒంటరి గది తెరుచుకునే పుస్తకమయ్యింది

♦

పత్రాలు తుంచే మునివేళ్ళ
సుతారమైన స్పర్శ కు దూరమైన చెట్టు
గుబురుతనాన్ని
దుఃఖంలా పెంచుకుంది

♦

తరచి తరచి అద్దం లాంటి
సన్నిగొడ్డని చూస్తే
నిన్న మొన్నటి సూర్యాస్తమయాలన్నీ
ముఖాన్ని ఆక్రమించిన
నల్లని మచ్చల్లా మిగిలి పోయాయి... ♦

## ఊరిబడి

- సోమిశెట్టి వేణుగోపాల్
8977349361



దేవుడి హుండీలో
లక్షల బహుమానాలు
కోరికల బండిలో
కోట్ల నజరానాలు

ఆకలి వరుసలో
ఆఖరి దేశం
అణ్వస్త్రాలో రామచంద్రా !
అని అరుస్తోంది

జీవించే హక్కు
పూర్తిగా ఉచితం
ఆధార్ షరతులు
వర్తిస్తాయి

రాజకీయం ఒక
ఊసరవెల్లి
స్వార్థం ఎప్పటికీ
గొంగళి పురుగే

నష్టాల రైతుకి
కష్టాల కోర్టులో ఉరిశిక్ష
కసాయి తలారి కదా
ఈ వ్యవసాయ దళారి

కృషి వికటించింది
దయ మరణించింది
నిర్దయ చేసిన పరిశోధన
తుపాకి

గోటితో పోయ్యేది
గొడ్డలిదాకా వచ్చింది
ఓటుతో పొయ్యేది
కుంభకోణంగా మారింది

ఆహారంలో కల్తీ
ఆలోచనలో కల్తీ
కోడి ముందా?
గుడ్డు ముందా?

కొత్త ఆపరేటింగ్ సిస్టంలో
చిక్కుకుంది ఏకాంతం
ఒంటరైపోయాడు
పాపం సంఘజీవి

మనిషి కాటుకు
మందులేదు
విశ్వాసం లేని విషనాగు
వెన్నుపోటు

నాడు మహనీయులను
తీర్చిదిద్దిన గుడి
నేడు అంటరానిదానిలా
ఊరిబడి

టి.వి. రిమోట్
నా చేతిలో ఉంది
నిర్ణయాధికారం అంతా
వ్యాపారప్రకటనదే ♦

# సామాజిక పోరాటంలో సమగ్ర దృష్టి




- తెలకపల్లి రవి

ప్రొఫెసర్ కంచ ఐలయ్య పుస్తకంలో అధ్యాయం పునర్ముద్రణపై ప్రకంపనాలు ఈ కోవలోనే వున్నాయి. ఆ పుస్తకాన్ని నిషేధించాలని, ఐలయ్యను ఉరి తీయాలని బాధ్యత గల శాసనకర్తలే మాట్లాడ్డం దారుణం. తన ఫోటోను కాళ్ల కింద వేసి తొక్కడం మరో అఘాయిత్యం. ఏదైనా నచ్చని వాటిని ఖండిస్తూ తమ వాదనలు చెప్పొచ్చు, రాయొచ్చు. అంతేగాని ఆ రచయితపై దాడి చేయడం అప్రజాస్వామికం.

మహా రచయిత కొడవటిగంటి కుటుంబ రావు ఏడెనిమిది దశాబ్దాల కిందటే 'కులం గాడి అంత్యక్రియలు' అంటూ ఒక కథ రాశారు. కాని ఇప్పటికీ మానని గాయంలా కులం భారతీయ సమాజాన్ని పట్టి పీడిస్తూనే వుంది. కుల తత్వాల ప్రకోపంతో పాటు మతాల మధ్య మంటలు పెట్టే రాజకీయాలు నడుస్తున్నాయి. కుల మత తత్వాలు జంట భూతాల్లా వెంటాడుతున్న వాస్తవాన్ని గుర్తించిన వారెవరైనా ఆచితూచి మాట్లాడాలి. ఇలాంటి సందర్భాల్లో ఏ పక్షమైనా అవకాశవాద రాజకీయాలకో లేక వ్యక్తిగత ప్రచార లంపటానికో పాల్పడితే పరిస్థితి మరింత దిగజారుతుంది. వైశ్యులకు సంబంధించి ప్రొఫెసర్ కంచ ఐలయ్య పుస్తకంలో అధ్యాయం పునర్ముద్రణపై ప్రకంపనాలు ఈ కోవలోనే వున్నాయి. ఆ పుస్తకాన్ని నిషేధించాలని, ఐలయ్యను ఉరి తీయాలని బాధ్యత గల శాసనకర్తలే మాట్లాడ్డం దారుణం. తన ఫోటోను కాళ్ల కింద వేసి తొక్కడం మరో అఘాయిత్యం. ఏదైనా నచ్చని వాటిని ఖండిస్తూ తమ వాదనలు చెప్పొచ్చు, రాయొచ్చు. అంతేగాని ఆ రచయితపై దాడి చేయడం అప్రజాస్వామికం.

హిందూ సమాజంలో కుల వివక్ష, పీడన కఠోర వాస్తవాలనేది ముందుగా ఎవరైనా అంగీకరించాల్సిన అంశం. అగ్రకులాలుగా చెప్పుకున్నవారు కిందివారిపై అణచివేత, ఆధిపత్యం సాగించిన మాట పచ్చి నిజం. పూర్వీకుల అప్పులు సంక్రమించినట్టే ఈ తప్పులపై విమర్శలు కూడా మోయడానికి సదరు తరగతుల వారసులు సిద్ధపడవలసిందే. ఇప్పటికీ ఆ కులతత్వాలున్నవారు వాటికి సమా ధానం చెప్పుకోవాలి. లేనివారు విమర్శకులతో గొంతు కలపొచ్చు. మరో వైపున కుల వివక్షపై పోరాడేవారు, పోగొట్టాలనుకునేవారు అన్ని కులాల లోని సహృదయులతో విశాల ఐక్యత పెంపొందించాలి తప్ప కొన్ని కులాలను రెచ్చగొట్టేలా వ్యవహరించకూడదు. గాంధీజీని 'చతుర్ బనియా' (తెలివైన కోమటి) అని వర్ణించిన అమిత్ షాలా చేయకూడదు.

ప్రస్తుత వివాదం పూర్వాపరాల్లోకి వెళితే-2011 నవంబరులో ఎమెస్కో సంస్థ ప్రచురించిన 'హిందూ మతానంతర భారత దేశం' అనే ఐలయ్య పుస్తకంలో 13 అధ్యాయాలున్నాయి. ఇందులో 11 అధ్యాయాలు కులాలకు ఆయన ఇచ్చిన వర్ణనలు... గిరిజనులు ఉచిత ఉపాధ్యాయులు, మాదిగలు బదుగు వర్గ శాస్త్రజ్ఞులు, మాలలు ఉత్పత్తి సైనికులు, రజకులు బదుగువర్గ స్త్రీవాదులు, క్షురకులు సామాజిక వైద్యులు, యాదవులు మాంసం పాల ఆర్థికవేత్తలు, గౌడ-కంసాలి-కమ్మరి-కుమ్మరి-వడ్రంగి మొదలైన కులాల వారు

అజ్ఞాత ఇంజనీర్లు, శూద్రులు (అంటే కాపులు, రెడ్లు, కమ్మ తదితరులు) ఆహార ఉత్పత్తిదార్లు, కోమట్లు సామాజిక స్మగ్లర్లు, బ్రాహ్మణులు ఆధ్యాత్మిక నియంతలు, ఇక ఆ తర్వాత భారత దేశంలో ఇప్పటి వరకూ రూపుదిద్దుకున్న మేధా ప్రపంచం 'ఇంటలెక్చువల్ గూండాలు' అనే శీర్షికతో కొట్టిపారేశారు. రాజకీయ పాలనా రంగాలలో ఫెడరల్ వనరుల మీద బ్రాహ్మణ వైశ్య శక్తులు పెత్తనం చలాయిస్తుంటే రాష్ట్ర స్థాయిలో కమ్మ, రెడ్డి, పటేల్, జాట్, మరాఠా వంటి అగ్రవర్ణ శూద్రులు అధికారాన్ని నియంత్రిస్తున్నారని సిద్ధాంతీకరించారు. భారత దేశంలో రాజకీయ నాయకత్వం దాదాపుగా మొత్తం ఇదే శక్తులతో ఇదే నేపథ్యం వున్న వారితో నిండిపోయిందన్నారు. కమ్యూనిస్టులతో సహా అందరిపైనా ప్రతికూల వ్యాఖ్యలు ఆ పుస్తకంలో అనేక చోట్ల చూస్తాం. కొన్ని అంశాలు ఎంత అశాస్త్రీయంగా వున్నాయంటే కృష్ణుడు రాసిన గ్రంథాన్ని (భగవద్గీతను) బ్రాహ్మణీయ శక్తులు కచ్చితంగా తిరగ రాసి వుంటాయని వూహిస్తున్నారు.

ఆది కాలం నుంచి ఆధునిక కాలం వరకూ మొఘలులు ఆంగ్లేయుల పాలనా కాలంతో సహా కుల వ్యవస్థ కొనసాగుతున్నదంటే దోపిడీ రాజ్య ప్రయోజనాలను అది కాపాడుతున్నది గనకనే. కాని కులాల పుట్టుక పరిణామం గతంలో వర్తమానంలో వాటి పాత్ర వంటి వాటిపై సమగ్ర పరిశీలన లేకుండా వ్యక్తిగత అనుభవ వాదంతో సాధారణ సూత్రీకరణలు చేస్తే సరిపోదు. 'ఉత్పత్తి ప్రాథమిక దశలో వర్గమే కులం' అని డి.డి.కోశాంబి అన్నారు. సుదీర్ఘ పరిణామ క్రమంలో దేని నిర్దిష్టతలు దానికి వున్నాయనేది వాస్తవం. అలాంటి చర్చ చాలా సార్లు జరుగుతూనే వుంది. ఆ విధంగా చూస్తే నేటి ప్రపంచీకరణ దశ నాటికి కులం ఏఏ మార్పులకు లోనైంది? ఉదాహరణకు శూద్రులను చదువుకోరాదని నిషేధించిన సమాజంలో ఐలయ్య షెపర్డ్ ప్రొఫెసర్ ఎలా కాగలిగారు? ఆయన తన పుస్తకంలో శూద్రులలో అగ్రవరా?లు వున్నట్టు చెప్పడానికి నేపథ్యం ఏమిటి? వివిధ కులాలలో పైకి జరగడం (ఊర్ధ్వ చలనం) కిందకు జారడం (అథ: పతనం) ఏ మేరకు జరిగింది? మధ్యంతర కులాలలో మార్పులేమిటి? ఇన్నేళ్ల రిజర్వేషన్ల తర్వాత కూడా దళిత వర్గాలు ఎందుకు అసమానతలకు, అమానుషాలకు గురవుతున్నాయి?

**చిల్లర వ్యాపారంలో ఎఫ్‌డిఐల ప్రవేశంతో చితికిపోయే చిరు వ్యాపారిని లేదా జీఎస్‌టి భారానికి గుడ్లు తేలేసే వర్తకులు కూడా పోరాటాలు నిరసనల్లో పాల్గొంటున్న సందర్భం ఇది.**

అగ్రవరా?లుగా చెప్పబడే వారిలోనూ పేదరికం ఎంత వుంది? అన్ని కులాలలోనూ మహిళలపై వివక్ష ఎందుకు కొనసాగుతూనే వుంది? ఇవీ ఇలాంటి ఇంకా అనేక ప్రశ్నలు వేసుకోవాలంటే చరిత్రనూ, ఆర్థిక సాంస్కృతిక అంశాలను మేళవించి చూడాలి. భూమి-ఉపాధి వంటి వాటితో దానికి వున్న పీటముడిని విప్పడం ఇంకా ముఖ్యం.

వైశ్యులనే తీసుకుంటే ఉత్పత్తిదారులుగానూ వ్యాపారులుగానూ ఆయా దశల్లో పాత్రలు పోషించారు. 'శూద్రుల శ్రమ, వైశ్యుల పన్నులు రాజ్యాన్ని బతికించాయి' అని చరిత్రకారులు రాశారు. వారు సామాజిక స్మగ్లర్లనో లేక వారిది పాపిష్టి పెట్టుబడి అనో అంటే అది ఆ ఒక్క కులానికే వర్తించే విషయం కాదు. అతి పవిత్రమైన పెట్టుబడి ఎక్కడైనా ఎవరి దగ్గరైనా వుందేమో తెలియదు. పెట్టుబడి ఎప్పుడూ చెమట, రక్తంతో తడిసే వుంటుందనేది నానుడి. దేశ సంపదలో 58 శాతం కలిగి వున్న ఒక్క శాతం సంపన్నులను గుత్త కుబేరులుగా గాక కోమట్లుగా ముద్ర వేయడం వల్ల జరగాల్సిన పోరాటం దారి తప్పడమే అవుతుంది. జిఎంఆర్‌నో అంబానీనో కార్పొరేట్లుగా గాక వైశ్య ముద్రతో చూపించడం అంటే ఆర్థిక విశ్లేషణను విస్మరించడమే అవుతుంది. చిల్లర వ్యాపారంలో ఎఫ్‌డిఐల ప్రవేశంతో చితికిపోయే చిరు వ్యాపారిని లేదా జిఎస్‌టి భారానికి గుడ్లు తేలేసే వర్తకులు కూడా పోరాటాలు నిరసనల్లో పాల్గొంటున్న సందర్భం ఇది. ప్రజాస్వామిక శక్తులు చేసే వాదన ఇలాంటి సమైక్య పోరాటాలకు దోహదపడేలా వుండాలి.

హిందూమతంలో వివక్షపై అమానుషాలపై పోరాడ్డం వేరు, మతాల మంచి చెడ్డల మధ్య తీర్పులు చెప్పడం వేరు. ఆది బౌద్ధాన్ని పక్కన పెడితే ఏ మతంలో వుండే లోపాలు, పాపాలు వాటికి వున్నాయి. ప్రత్యేకతలూ వుండొచ్చు. అది వేరే చర్చ. ఇప్పుడు కావలసింది మత సామరస్యం. రాజకీయాల నుంచి మతాలను దూరంగా వుంచడం. కాని ఉదార ప్రజాస్వామ్య విధానాలను అనుసరించినందువల్ల క్రైస్తవ ప్రపంచం నేడు అత్యంత శక్తివంతమైందిగా ఆవిర్భవించిందని ఐలయ్య చేసే ప్రశంస సామ్రాజ్యవాద రక్తసిక్త చరిత్రను మరుగు పరుస్తుంది. ఇంగ్లీషు భాషకు ప్రాబల్యం ఇచ్చింది వలసాధిపత్య

## కవిత

# దేశం నాదే

- అడిగోపుల వెంకటరత్నమ్
9848252946



శ్రమకు జ్వలించిన రక్తం
ఘర్మజలంగా మారింది
కడవల్లో కొలిచి
త్రాసుల్లో తూచి
ఒక నాణెం మజూరి విసిరి
వందనాణేలు జవిరి
అందలమెక్కి వూరేగుతూ ఒకడు
శరీరం నాదే
నా స్వేదం నాది కాదు !

మతం మత్తు మందంటూ
సాగిన నా ప్రచారం
మానవాళి మస్తిష్కాల్లో
చిరుదీపం వెలిగించాక
పెనుదీపమై
ప్రమాదముందని మూఢులు
నా పై దండయాత్ర
ప్రచారం నాదే
నాది దుష్ప్రచారం కాదు !

ఏటిని ఎగ్గట్టి
కలుజుల్ని కట్టడిచేసి
పంటకాలువ పూడికతీసి
రోహిణీలో ఎండి
మేఘాలకు పహరా కాశాను
వంధ్య విత్తనాలపై
కల్తీయూరియా పై దండెత్తి
పొలం మోయలేని
దిగుబడి
పండించాను
బురిడీ కుంచాల్తో
కల్లంలో కొలిచిన దళారి
గిట్టుబాటు ధరంటూ
గిట్టుబడి కాని
రొక్కమిచ్చాడు
పొలం నాదే
నా పంట నాది కాదు !
ఇవ్వాల్సింది దేశానికిచ్చి
రావాల్సిన దాన్ని
అడుగుదామని
అంబరానికి నిచ్చెనలు వేసి
ఉరకలు వేసే యౌవ్వనంలో
పిడుగుల్ని బంధించాలని
యువతిగా ఆశయాలు
నా యౌవ్వనానికి మాటువేసి
ఎసరుపెట్టి కూర్చున్నాడు ఒకడు
ఒళ్ళునాదే
నా యౌవ్వనం నాది కాదు !
దేశం నాదే
నా దేశానికి నేనేం కాదు ! ◆

---

ఫలితమే. ప్రపంచమంతటినీ వలసాధిపత్యానికి లోను చేసిన ఇంగ్లాండు అనుసరించిన మతం శక్తి దాయకమనీ, విముక్తి సాధనమని ఆయన చెప్పే దాంట్లో ఔచిత్యం లేదు. ఇంగ్లీషు వస్తే చాలునని, తెలుగులో గాక ఇంగ్లీషు మీడియమైతే హఠాత్తుగా అభివృద్ధి జరిగిపోతుందని చెప్పడం వూహాజనితం, స్వీయాత్మకం తప్ప శాస్త్రీయం కాదు. హిందూత్వ పేరిట మతతత్వ రాజకీయం తిష్ట వేసుకుంటే హిందూ మతం మరణ శయ్యపై చేరిందని ఐలయ్య సూత్రీకరిస్తున్నారు. హిందూ మతానంతర జోస్యాలు చెబుతున్నారు. పుంఖాను పుంఖాలుగా హిందువులు క్రైస్తవంలో చేరిపోతున్నారని ఆయన చెప్పే మాట హిందూత్వ శక్తుల ప్రచారంతో అచ్చంగా సరిపోతుంది. ఇది వాస్తవాలతో పొసగదు. పైగా హాని చేస్తుంది.

కనుక శ్రమ జీవుల పట్ల పక్షపాతాన్ని ఆహ్వానిస్తూనే మొత్తంపైన ఐలయ్య పరిశీలన పాక్షికమైనదని చెప్పవలసి వుంది. పైగా అది ఇప్పుడు జరగాల్సిన విశాల పోరాట ఐక్యతకు విఘాతం కలిగించే అవకాశం వుంది. పాలక వర్గాలు ఈ పుస్తకంపై వచ్చిన విమర్శలకు అవసరాన్ని మించి స్పందిస్తున్నాయంట, స్వాములు రంగ ప్రవేశం చేసి రెచ్చిపోతున్నారంటే అందుకోసమే. అందుకే ప్రజాస్వామిక వాదులు అప్రమత్తం కావాలి. ఈ నాడు అన్ని కులాలలోనూ అత్యధికులు ఆర్థికంగా చితికిపోతున్నారు. అందులోనూ అణగారిన వర్గాలు మరింత నష్టపోతున్నాయి. అందుకే ప్రొఫెసర్ ఐలయ్యపై దాడులను ఖండిస్తూనే ఈ మొత్తం సమస్యను సమగ్రంగా చూడటం అవసరం. మతం మార్కెట్ జట్టుకట్టిన ప్రపంచీకరణ ఘట్టంలో ఆర్థిక సామాజిక సమానత్వంకై పోరాటాల మేళవింపు జరగాల్సిందే. ◆

- గంగాధర్ వీర్ల
9502328972



# వెన్నెలమ్మ జాతకం

"మైడియర్ వెన్నెలా.. నీకు ఈపేరు ఎవరు పెట్టారు?" అని ఎప్పుడూలేంది.. రాహుల్ కొత్తగా అడిగేసరికి.. పుస్తకాలు సర్దడం ఆపి వెనక్కి తిరిగి చూసిందామె. " పేరు గురించి అడుగుతుంటే.. అదేదో అడుగుతున్నట్టుగా మొఖంలో ఆ క్వశ్చన్ మార్కేంటి" పగలబడి నవ్వేశాడతడు.

"అదేంటో.. చిత్రకారుడి గొంతు ఇవాళ.. ఏదో వింతగా ధ్వనిస్తున్నట్టుంది" కొంటెగా అడిగింది. " నీ ప్రియాతి ప్రియమైన ఈ చిత్రకారుని గొంతులో గూడార్థాలు, పెడర్థాలూ ఏమీలేవుగానీ.. ముందు నీకు వెన్నెల అని పేరు ఎవరు పెట్టారో చెప్పు" మరోసారి నవ్వుతూ అడిగాడు.

" అబ్బో.. ఎప్పుడు లేంది.. ఏంటో ఈ కుతూహలం..?" అందామె. "కుతూహలమో.. సరససల్లాపమో? తేల్చడం కష్టంలే.." సస్పెన్స్ రేకెత్తించాడతడు. " అయితే.. వద్దులే.. అక్కడితో ఆగిపోతేనే బెటర్" అంటూ రాహుల్ మాటల గారడీకి చెక్ పెట్టాలని సరదా ప్రయత్నం చేసిందామె.

" అబ్బో.. అయితే చెప్పొద్దులే.. " దగ్గరకు వెళ్ళి వెనక నుంచి ఆమాంతంగా ఆమెను హత్తుకున్నాడు రాహుల్.

"ఓయ్.. మళ్ళీ ఇదేం ట్విస్ట్.. మీ ఊళ్ళో ఎవరి పేరైనా అడగాలంటే..ఇలాగే.. గభాల్న చుట్టేసుకుంటారా?!" నడుమును ఒడుపుగా చుట్టుకున్న రాహుల్ చేతుల్ని సుతారంగా విడిపించుకోబోతూ అంది వెన్నెల.

" హేయ్.. నువ్వు నిజంగానే వెన్నెలవు.. చూడు ఎంత చల్లగా ఉన్నావో" మరింత గట్టిగా వాటేసుకున్నాడు రాహుల్. " హేయ్.. రాహుల్.. ఏంటిది? నువ్వు ఇక్కడకొచ్చింది.. నాపేరు ఎందుకు పెట్టారు, ఎలా పెట్టారో కనుక్కోడానికా? లేక మరింకెందుకైనానా?" రాహుల్ దగ్గర తనాన్ని.. సుతిమెత్తంగా విడిపించుకోబోయింది.

" రెండూనూ.." అంటూ చుబుకాన్ని ఆమె మెడవంపులపై ఆనిస్తూ మత్తుగా బదులిచ్చాడు. " భలే ఉందే నీ వరస.. అరె.. పిల్లాడు.. బుద్ధిమంతుడు, పైగా చక్కగా బొమ్మలేస్తాడు.. అని ఏదో ముచ్చటపడితే, ఏంటీ ఆకస్మిక దాడులు?" రాహుల్ వైపు తిరిగి.. అతడి కళ్ళల్లో కళ్ళుపెట్టి.. గుచ్చి గుచ్చి చూస్తూ అంది వెన్నెల.

ఆమె కాసింత ఏమరుపాటుగా తన బాహువులవైపు తిరిగే సరికి.. మరింత దగ్గరగా తన హృదయాన్ని అదుముకున్నాడు రాహుల్. " ఏంటో చెప్పండి సార్.. " అతడి కొనదేలిన ముక్కును చూపుడు వేలితే సుతారంగా ఆడిస్తూ ప్రేమగా అడిగింది వెన్నెల.

" అడిగేదేముంది. ఇక ఉభయకుశలోపరి.. అడిగీ అడగలేక.. ఒకమాటే తెలపనా..." అంటూ పల్లవితో తన చెంపల్ని చుంబించాడతడు. " చాలు చాలు.. చాలు..విరహాలు చాలు చాలూ.." అంటూ మరో పల్లవి జతగా.. సమయోచితంగా అతడి బంధనాల నుంచి అయిష్టాంగానే బయటపడిందామె.



" అంతేనంటావా?!" పక్కనున్న సోఫాలో కూలబడుతూ అన్నాడు రాహుల్. " పెళ్ళయ్యేదాకా.. అంతే.. వీలైతే కప్పుకాఫీ.. నాలుగు మాటలు.. అంతే.." చిలిపిగా వార్నింగ్ ఇచ్చింది వెన్నెల. " వెన్నెల గారూ.. మీరు రాను రానూ.. చాలా పొయిటిక్ గా మారిపోతున్నారు.. ఇలా అయితే కష్టమండీ" కొంటెగా చూస్తూ అన్నాడు.

" కష్టమైనా.. నష్టమైనా.. లాభమైనా.. అప్పటిదాకా.. అంతే అంతే.. " అంటూ కళ్ళతోనే రొమాంటిక్ గా బెదిరించింది వెన్నెల. " సరేమరీ.. ఏం చేస్తాం.. రాణీగారి మాట.. శిరోధార్యము.. " నిట్టూర్చినట్టు నటించాడు రాహుల్

"హల్లో మాష్టారూ.. ఇంతకీ తమరు ఉదయాన్నే.. ఇచటకు వచ్చుటకు కారణమేమీ?" దగ్గరగా వచ్చి రాహుల్ చుబుకాన్ని అటూ ఇటూ ఆడిస్తూ అడిగింది వెన్నెల.

" వెన్నెల్ని హత్తుకుని, ఎత్తుకుని, ఎక్కడికో ఎత్తుకుపోదామని.." అదే మూడ్ లో అన్నాడు.

" నాకూ.. అలాగే ఉంది మరీ. నీతో ఎక్కడికైనా నాలుగు రోజులు ఎగిరిపోయి.. అలా గాల్లో తేలిపోవాలని.. కుదురుతుందా మాష్టారు.. అందుకే.. ఎగిరిపోవడాలు, గాల్లో తేలిపోవడాలు మనసులో ఏమైనా ఉంటే.. కొన్నాళ్ళపాటు వాయిదా వేసుకోవాలి తప్పదు" కంటితో సైగలు చేస్తూ రాహుల్ ని సముదాయించింది వెన్నెల.

"నువ్వు నిజంగానే ఇక్కడ ఉండాల్సిందానివి కాదు.. ఎక్కడో ఉండాలి.. " అని రాహుల్ అనేసరికి.. " ఎక్కడో మరి.. " అడిగింది వెన్నెల. " వాతావరణశాఖలో.." అంటూ పగలబడి నవ్వేశాడు రాహుల్.

" అంటే.. సముద్రం ఉప్పొంగేలా ఉంది.. వేటకెళ్ళొద్దు.. ఇంటిపట్టునే ఉండండి.. అనేనా?" అంది రాహుల్ మాటల్లోని మర్మాన్ని ఎరిగిన వెన్నెల.

" ఇంతకీ.. నాపేరు గురించి తమరికి ఎందుకు కొత్తగా పరిశోధన చేయాలనిపించిందో.. చెప్పనేలేదు.. సెలవిస్తారా?" అని ఆమె అడగ్గానే

"ఎందుకో..అడగాలనిపించింది.." మాట దాటేయబోయాడు రాహుల్ " అయ్యా.. శ్రీమాన్ చిత్రకారా.. మీరు.. మాట్లాడే మాటలకు.. కేవలం క్వచ్చన్లేగానీ.. ఆన్సర్లు ఉండవా?!" ఎదురుగా ఉన్న సోఫాకుర్చీలో కూర్చుంటూ అడిగింది వెన్నెల.

" చెప్తే.. నువ్వు తిడతావు. ఎందుకులే.. వదిలేసేయ్" అనగానే " ఏంటీ వదిలేసేది.. ఆ పేరు గురించి తెలుసుకోవాలనేగా.. నువ్వు.. ఆమాంతంగా నడుం చుట్టేసుకుని.. ఇంకేదో.. చెయ్యబోయింది.. వదిలేసేయ్.. అంటే ఒప్పుకుంటానా.. చెప్పాల్సిందే.. " సుతిమెత్తగా గద్దించి అడిగింది వెన్నెల.

"రేపు.. మా డాడీని కలవబోతున్నాం.. " అందుకే అడిగా అన్నాడు రాహుల్. అదేంటి.. ఇంత సడన్ గా.. అయినా.. నేను కూడా మెంటల్ గా ప్రిపేర్ కావాలిగా.. ఇంత సడన్ గా ప్లాన్ చేస్తే.. ఎలా.. ఎనీ ప్రాబ్లెమ్?" కొంచెం కంగారుపడుతూనే అడిగింది వెన్నెల.

" నో.. ప్రాబ్లమ్.. ఎవ్వరీథింగ్ ఈజ్ ఆల్ రైట్.. మన గురించి అన్ని విషయాలు చెప్పేశా.. నాన్నకైతే.. మన ప్రేమ, పెళ్లి విషయంలో ఎలాంటి.. అభ్యంతరాలు లేవు. నేను ముందే చెప్పాగా.. మా అమ్మనాన్నలది కూడా కులాంతర వివాహమే అని.. నీ గురించి అన్ని విషయాలూ చెప్పాక.. అమ్మకూడా చాలా సంతోషించింది." నిజమా.. " ఇంచుమించు ఆశ్చర్యపోతూనే అడిగింది వెన్నెల. " నిజమా..? అని ఆశ్చర్యపోతావేంటి? నిజమే.. ఇంక పెళ్ళే తరువాయి.. " చాలా రిలాక్స్ డ్ గా చెప్పుకొచ్చాడు రాహుల్

" అమ్మాయికి అందం. చదువు అన్నీ ఉన్నాయిగానీ.. డబ్బేలేదని చెప్పావా?! మరి?" కాస్తంత అనుమానంగా అడిగింది వెన్నెల. " ఇదిగో వెన్నెలా.. నీకన్నీ అనుమానాలే... అయినా మాకు డబ్బులేం అవసరం. మానాన్న సంపాదించిందంతా నాదే కదా?!" పెళ్లికి ఆర్థిక విషయాలు కూడా అడ్డుగోడలు కావు అని స్పష్టం చేశాడతడు.

" సో.. మనం తొందరలోనే పెళ్లి పీటలు ఎక్కాబోతున్నామన్నమాట.." దగ్గరగా వచ్చి అతడి మెడమీద

రెండు చేతులు వేసి అడిగిందామె.

" యస్.. అవును. ఆ ఒక్క పేరు బలాలు చూసుకుంటే.. నెలరోజుల్లోనే మన పెళ్లి కూడా చేసేలా ఉంది ఇంట్లోవాళ్ళ తొందర.." నవ్వుతూ అన్నాడు రాహుల్

" పేరు బలాలు చూసుకోవాలా" ఆశ్చర్యపోతూ అడిగిందామె

" అవునట.. ఆస్తులు, అంతస్తులు, కులం, మతాలు కలవకపోయినా పర్వాలేదుగానీ, పేర్లు కలవాలట.. అప్పుడే మనం సంతోషంగా కలిసుంటాం. మనకు పుట్టే పిల్లలు కూడా బావుంటారు.. అంటున్నారు అమ్మానాన్న. నాక్కూడా ఎందుకో.. వాళ్ళు అన్నది కరెక్టే అనిపించింది. ఇందులో పోయిందేముంది. మనద్దరి పేర్లు, జాతకాలు ఒకసారి చూపిద్దాం. అయినా.. మనం ఇంతగా కలిసిపోయాం.. బోడి పేర్లు, జాతకాలు కలవ్వా చెప్పు. అలా చేస్తే అమ్మానాన్నలక్కూడా తృప్తి ఉంటుంది. వాళ్ల మాటనూ మనం గౌరవించినవాళ్ళమవుతాం..ఏమంటావ్.. బంగారం?" లాలనగానే అన్నాడు రాహుల్

" అయితే.. మన ఇద్దరి పేర్లూ కలవకపోతే.. మనకు పెళ్లి కాదన్నమాట.." అతడి భుజాలపై వేసిన చేతుల్ని విదిలించుకుని కాస్తంత కోపంగానే అడిగింది వెన్నెల

" ఇదిగో.. బంగారం.. నువ్వు ఊరికే.. సీరియస్ అయిపోకు.. జస్ట్ ఫార్మాలిటీ అంతే.. " సర్ధిచెప్పబోయాడతడు.

"ప్లీజ్ రాహుల్..ఇంకేమి మాట్లాడకు.. పెళ్లి చేసుకునేది మనం. మన ఇష్టాలు, అభిరుచులు గౌరవించాల్సింది పెద్దలు. అక్కడదాకా ఓకే. మన ప్రేమను ఒప్పుకోడానికి.. ఏ ఇబ్బంది లేనప్పుడు.. మధ్యలో ఇదేం కండిషన్.. ఇట్స్ నాట్ ఫెయిర్? రాహుల్.. రియల్లీ.. ఇట్స్ పిటీ థింగ్ ' నొచ్చుకుంది వెన్నెల

" వెన్నెలా.. నువ్వు ఊరికే మూర్ఖంగా మాట్లాడకు.. ఏదో పెద్దవాళ్ళు అడిగారు.. వారి ఇష్టాన్ని గౌరవిస్తే తప్పేంటి చెప్పు.. వాళ్ళు అన్నది కూడా మనం బావుండాలి.. చక్కగా కలిసి మెలిసి ఉండాలనేకదా?" తన ప్రపోజల్ ని సమర్థించుకున్నాడు రాహుల్

" బావుంది.. రాహుల్.. నిజంగానే నిన్ను చూసి జాలికలుగుతుంది. వాళ్ళు మనం కలిసి ఉండాలనుకోవడంలేదు.. పేరు, జాతకాల పేరుతో



విడదీయాలనుకుంటున్నారు. ముందు అది తెలుసుకో.." కాస్తంత కోపంగానే అందామె.

" నువ్వు మరీ.. మావాళ్ళను తక్కువ చేసి మాట్లాడకు. మన మధ్య కులం, మతం, హోదాల విషయాల్లో ఎంతో అంతరం ఉన్నా.. పెద్దమనసు చేసుకుని ఒప్పుకోవడం నీకు తప్పైపోయిందన్నమాట.. వాటే స్టుపిడిటీ?" అంతే కోపంగానే అన్నాడు.

" ఒప్పుకోకపోతే.. వదిలేస్తావన్నమాట?" ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి.

" వెన్నెలా.. నువ్వు విషయాన్ని మరీ ఎమోషనల్ గా తీసుకోకు.. " సముదాయించబోయాడు.

" ముందు నేనడిగింది చెప్పు రాహుల్.. ఒకవేళ మీ అమ్మనాన్న ఒప్పుకోకపోతే.. ఏంచేసుండేవాడివి?" గద్దించి అడిగిందామె. " నువ్వుమరీ పంతంపట్టినట్టు అడక్కు.. వెన్నెలా.." అతడిలో ఏదో అసహనం.

" చదువుకొన్నవాళ్ళం.. సంస్కారంవంతులం.. ఆదర్శవంతులం, పెళ్లి, ప్రేమ విషయంలో మనకే పట్టింపులుండవు.. మన ప్రపంచం వేరు.. ఇలా ఎన్నో అనుకున్నవాళ్ళం.. ఇప్పుడు కొత్తగా.. మనం కలిసి కాపురం చెయ్యాలంటే పేరు, జాతక బలాలు కలవాలనే దగ్గర అవన్నీ ఆగిపోయాయన్నమాట.. ప్చ్" నిష్టూర్చిందామె.

" నువ్వేదేదో ఊహించుకుని మాట్లాడుతున్నావ్.. అమ్మాయి పేరు, జాతకాలు కూడా చూద్దాం.. అడిగి తీసకురారా.. అని జస్ట్ క్యాజువల్ అడిగారంతే.. దానికి నువ్వు ఇంత రాద్ధాంతం చేస్తావేంటి?" చాలా క్యాజువల్ అన్నాడు రాహుల్.

" అవును.. ఇవ్వాల పేరు. రేపేమో కులం, ఎల్లుండేమో.. మా అమ్మనాన్న కులగోత్రాలు.. అవన్నీ మీవాళ్ళకి నచ్చాలి. అప్పుడుగానీ.. నీకు నేను పెళ్ళాన్నికాలేను.. అంతేగా" వెన్నెల స్వరం బుసలు కొడుతోంది.

" నీ ఇష్టం వెన్నెలా.. నువ్వు అర్థం చేసుకోకపోతే నేనేం చెయ్యలేను.. ఇదంతా జస్ట్ ఫార్మాలిటీస్.. అంతే" అని అనగానే.. " ఇంతా చదువుకుని.. నువ్వుకూడా ఫార్మాలిటీస్ అని.. సమర్థించడం బాలేదు రాహుల్. నాకు జాతకాలు, పేర్లు కలిస్తేనే పెళ్లి అంటే.. అర్థంపర్థంలేని అలాంటి

# వెంట పడనీయకు

- ఎస్.ఆర్.పృథ్వి
9989223245

భయపడే
బ్రతుకు యాత్రలోంచి
మృత్యు కుహరంలోకి జారిపోవడం
ధ్యానమనే నిశ్శబ్ద గానాన్ని వీడి
చావు కేకల నడుమ బంధీ కావడం
భయం, మనిషిని బ్రతకనీయదు
మనసును పిడికిట బిగించి
జీవజాలాన్ని పిండుతుంది
మెదడునంటిన
ప్రశాంత పరిమళ వాయువుల్ని తోడి
ప్రశ్నల విహంగమౌతుంది
భయం వలలో చిక్కుబడితే
భవిత దారులన్నీ చీకటిమయం
అనుమానాలన్నీ ఏకమై
చెట్టంత మనిషిని నేలకూలుస్తుంది



ఒక్కసారి భయం, వెంటపడితే
ధైర్యపు అణువులన్నీ చల్లబడతాయి
మనసు నూతిలో దాగేందుకు
భయానికి చోటిస్తే
పొంగే సముద్రమై
బ్రతుకును బలికోరుతుంది
కష్టాలు, నష్టాలూ
సుఖసంతోషాల మాదిరి
మనిషినే ఆశ్రయిస్తాను
అంత మాత్రాన
మనసును నడిపించే
ధైర్యం తీగెను తెంపెయ్యకు
కాలంతో పరుగు లెడుతున్న
భయాన్ని నీ వెంట పడనీయకు
భవితలో గెలుపు కోసమే పరుగెత్తు. ◆

ఫార్మాలటీస్ నాకక్కరలేదు.. " స్పష్టం చేసిందామె.

" అంటే.. నువ్వు నా ప్రేమను అనుమానిస్తున్నావన్నమాట?" అని రాహుల్ అనగానే " ఇన్నేళ్ళలో.. ఎప్పుడూ రాలేదు.. ఇప్పుడే అనుమానం కలుగుతుంది. కలిసి ఒక్కటిగా బతకాలనుకున్నప్పుడు ఇలాంటివన్నీ అవసరమా?! నీ మనసులోనూ ఏదో మూలన.. ఆ జాతకాల పిచ్చి ఉందికాబట్టే.. భౌతికవాదిగా కనిపించే నువ్వుకూడా.. ఓ మూర్ఖుడిలా ప్రవర్తిసున్నావ్? సారీ..రాహుల్" వెన్నెల గొంతు బొంగురుపోయింది.

తానెలాఉన్నా.. ఎప్పుడూ నవ్వుతూ.. తుళ్ళుతూ.. అందర్నీ సంతోషపెడుతూ సరదాగా ఉండే వెన్నెల కంట్లో కన్నీరు చెమ్మగిల్లడం.. రాహుల్ ఇప్పటిదాకా చూసింది లేదు. అనుకోకుండా తన బుర్రలోకి ప్రవేశించిన మూఢత్వపు భావజాలాన్ని నెమరువేసుకుంటుంటే.. తనకు తనకే గగుర్పాటు కలిగినట్టయ్యింది. వెన్నెల కళ్ళల్లోకి చూసే ధైర్యం చేయలేక రాహుల్ చాలాసేపు తలదించుకునే ఉండిపోయాడు.

" సారీ.. వెన్నెలా.. అమ్మానాన్న ఏ ఉద్దేశ్యంతో అడిగినాగానీ.. నేను ఆలోచించుకోకుండా, దాన్ని సమర్థిస్తూ ఆ విషయాన్ని నీవరకూ తీసుకురావడం నాదే తప్పు. పేర్లు, జాతకాలు.. అనేవి వొట్టి ట్రాష్ అని .. అమ్మానాన్న అడిగినప్పుడే వాళ్ళకు అర్థమయ్యేలా చెప్పాల్సింది. బహుశా వారి నమ్మకాన్ని కాదనలేక.. ఆ క్షణంలో వివేకంగా ఆలోచించలేకపోయా.. నువ్వనుకున్నట్టు మనల్ని విడదీయాలనే ఆలోచనా మావాళ్ళకు ఏకోశానాలేదు.." పశ్చాత్తాపుడ్డాడు రాహుల్. రాహుల్ మాటల్లో నిజాయితీని అర్థం చేసుకుంది వెన్నెల. కాసేపు ఇద్దరి మధ్యా మౌనం.

కులం, మతం, ఆస్తి, అంతస్తులు, జాతకాలు చూసుకుని మరీ ఎంతో ఆర్భాటంగా చేసిన పెళ్లిళ్ళెన్నో.. మూణ్ణాళ్ళకే పెడాకులవుతున్న సంఘటనలెన్నో సమాజంలో నిత్యం చూస్తున్నవే. పేరు, జాతక బంధాలు అంత బలంగా ఉన్నప్పుడు.. ఆ జంటను ఎందుకు విడదీస్తాయి? ఇద్దరు కలిసి బతకడానికి కావాల్సింది.. ప్రేమ, అనురాగాలు. అన్నిటికీమించి ఒకరిపై ఒకరికి నమ్మకం. అంతేగానీ, అర్థం కాని మూఢవిశ్వాసాలు కాదు. రాహుల్ మనసులో ఇవే ఆలోచనలు. "ఫైనల్ గా.. ఈ లవర్ బోయ్.. ఏమంటారు?" అతడి భుజాలపై ప్రేమగా చేతులేసి.. ఇద్ధరిమధ్యా వాతావారణాన్ని తేలికపరుస్తూ అడిగిందామె. వెన్నెల కరస్పర్శతో రాహుల్ మనసు తేలికపడింది.

" ఎలాగూ మనద్దరి జాతకాలు కలిసేలాగా లేవు కాబట్టి.. ఇంకేమాత్రం ఆలస్యం చేయకుండా.. ఇప్పుడుకిప్పుడే.. గాంధర్వ వివాహం చేసేకుందామంటా... మేడమ్ రెడీనా?!" అని రాహుల్ ఉత్సాహంగా అనగానే.. " గాంధర్వ వివాహమా.. ఖర్చే ఉండదు.. అయితే నేనూ రెడీ.." అంటూ అతడి నవ్వులో శృతికలిపింది వెన్నెల. ◆

# కాంక్షని రగిలిద్దాం

- లక్ష్మీ విజయ




ఎందుకునేస్తం
ఇంకా చుక్కలని తుంచి మాలగా
కురులలో పెట్టుకోవాలనే కాంక్షిస్తావ్
ఇంకా ఎన్నాళ్ళు
నిండుజాబిలి నీ వెండిపళ్ళెంలో
బువ్వవ్వాలని కలలుగంటావ్

ఒకసారి నీలోపల ప్రపంచాన్ని విడిచి
బయటకొచ్చిచూడు
ప్రతిపూట మనకిబువ్వపెట్టే రైతు
పొలం, హలం తప్ప మరో ప్రపంచం తెలీని రైతు
నడిరోడ్డుమీద రుధిరపు తివాచిని పరిచి
గిట్టుబాటుధర యివ్వమని మోకరిల్లుతున్నాడు
పదా అటుగా ఓసారి వెళ్ళివద్దాం
వీలయితే ఆ అభాగ్యపు అన్నదాతకి
ఓ రెక్కబలమవుదాం

అలాచూడు
రేయింబవళ్ళు మగ్గం మధిస్తూ
మన ఆత్మగౌరవం కాపడానికంటూ బట్టలల్లే నేతన్న
బ్రతుకుకింత విలువలేక వెలుగు లేక మగ్గిపోతున్నాడు.
పదా మన సిగ్గుకప్పినోడికి కాస్త సాయపడి వద్దాం
చేతకాకుంటే నిస్సిగ్గుగా సిగ్గుపడి వద్దాం

అదిగో అలాచూశావా
పరసంస్కృతి గాలేదో
నిన్ను నన్నూ పట్టిపీడిస్తోంది
అలా పదా వీలయితే
చేయిచేయి కలిపి తోసిపడేద్దాం

యింకా ఎన్నాళ్ళు
పంటమేసే పురుగులకి
ఎరువులు కనిపెడుతూ వుండిపోతాం
అలా రా
చేను మేసే కంచెకి పతనం కనిపెడదాం

పద నేస్తం
చిరుగు పట్టిన ఓజోన్‌కి
అతుకులు వేసే అరణ్యాలని చేపడదాం
పదనేస్తం
గతితప్పిన రుతువులని కాస్త సరిచేసి వద్దాం
పదనేస్తం
స్వార్థంలేని మానవజాడలు కనిపెడదాం
పదనేస్తం
అమ్మతనం అమ్మబడుతున్న అంగడుల పనిపడదాం

పద పద పద నేస్తం
ఆకలి లేని బ్రతుకులు
అబలలు లేని వీధులు
చూడాలని కలగందాం.
కాంక్షని రగిలిద్దాం.

◆

# తెలుగు సాహిత్య విమర్శ - వర్తమానం



- డాక్టర్ తన్నీరు కళ్యాణ్ కుమార్
9490776385

*ఈ రచయితలు తమ రచనలతో సాహిత్యాన్ని ప్రేమించే పాఠకులు ఇంకా ఉన్నారనే ధైర్యాన్ని ఇస్తున్నారు. అంతేకాదు అనేక మంది భావి రచయితలకు సైతం వీరు స్ఫూర్తినిస్తున్నారు. దిన, వార, మాస పత్రికల్లో కూడా చక్కని రచనలు వెలువడుతున్నాయి. తెలుగు సాహిత్య ప్రక్రియల్లో కొన్ని ప్రక్రియల్లో అధికంగాను, మరికొన్ని ప్రక్రియల్లో కొంత తక్కువగాను రచనలు నేడు వెలువడుతున్నాయి. సాహిత్యం పట్ల ఆసక్తి తగ్గుతున్న నేటి వేగవంతమైన కాలంలో కూడా విస్తృతంగా తెలుగు సాహిత్య రచనలు వెలువడుతుండటం ఒక శుభపరిణామంగానే చెప్పాలి.*

వినోదం అంటే టీవీ ఛానళ్ళు -ఇంటర్ నెట్‌లు, విజ్ఞానం అంటే మార్కులు అనే ధోరణితో ముందుకు సాగుతున్న ప్రస్తుత తరుణంలో, మాత ృభాషలో విద్యా బోధన-సంభాషణ, భాషాభిమానం మృగ్యమవుతున్న విపత్కర తరుణంలో కూడా తెలుగు సాహిత్యంలోని వివిధ ప్రక్రియల్లో సాహిత్య స ృజన చేస్తున్న నేటి రచయితలు, రచయిత్రులు అభినందనీయులు. ఈ రచయితలు తమ రచనలతో సాహిత్యాన్ని ప్రేమించే పాఠకులు ఇంకా ఉన్నారనే ధైర్యాన్ని ఇస్తున్నారు. అంతేకాదు అనేక మంది భావి రచయితలకు సైతం వీరు స్ఫూర్తినిస్తున్నారు. దిన, వార, మాస పత్రికల్లో కూడా చక్కని రచనలు వెలువడుతున్నాయి. తెలుగు సాహిత్య ప్రక్రియల్లో కొన్ని ప్రక్రియల్లో అధికంగాను, మరికొన్ని ప్రక్రియల్లో కొంత తక్కువగాను రచనలు నేడు వెలువడుతున్నాయి. సాహిత్యం పట్ల ఆసక్తి తగ్గుతున్న నేటి వేగవంతమైన కాలంలో కూడా విస్త ృతంగా తెలుగు సాహిత్య రచనలు వెలువడుతుండటం ఒక శుభపరిణామంగానే చెప్పాలి.

నేడు తెలుగు సాహిత్యం వెలువడినంతగా ఆ సాహిత్యం పై విమర్శ వెలువడటం లేదనే భావన అత్యధిక మందిలో ఉంది. మరీ ముఖ్యంగా గత రెండు దశాబ్దాలుగా సాహిత్య విమర్శ సన్నగిల్లిందనే అంశం అందరూ అంగీకరించాల్సిన విషయమే. ఒకటిన్నర శతాబ్దికాలంగా అనేక ఉద్యమాలకు, వాదాలకు, భావజాలాలకు ప్రేరణగా ఆధునిక తెలుగు సాహిత్యం విస్తృతంగా వెలువడుతుంది. సాహిత్యం వచ్చినంతగా విమర్శ రావడం లేదని, వచ్చే విమర్శ కూడా శాస్త్రీయంగా, గుణాత్మకంగా లేదని నేడు కొందరు అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు. నేడు వెలువడుతున్న విమర్శలో ఒక స్పష్టత, ఒక సూత్రబద్ధత, సరైన ప్రామాణికత కొరవడుతుందని ప్రస్తుత ఆరోపణ. ఐతే ఈ త్రిగుణాత్మక లక్షణాలను పుణికి పుచ్చుకున్న విమర్శకులు నేడు చాలా తక్కువమంది మాత్రమే ఉన్నారని చెప్పవచ్చు.

ఒక రచన యొక్క వైశిష్ట్యాన్ని సాహితీ లోకానికి పరిచయం చేయాల్సిన గురుతర బాధ్యత విమర్శకునిపై ఉంది. రచనల్లోని లోటుపాట్లును గూర్చి కూడా ఎత్తి చూపాల్సిన కర్తవ్యం కూడా విమర్శకునిదే. కానీ నేడు వెలువడుతున్న తెలుగు సాహిత్య విమర్శ కేవలం ప్రశంసలకు మాత్రమే పరిమితం అవుతుంది. విమర్శ పాఠకునిలో జిజ్ఞాసను

రేకెత్తించాలి. మంచి సాహిత్యాన్ని, అందులోని సొగసుల్ని, శిల్పాన్ని పాఠకునికి బోధించే ప్రయత్నం చేయాలి. తద్వారా మరింత లోతుగా పఠించి సాహిత్య సౌందర్యాన్ని ఆస్వాదించాలనే జిజ్ఞాసను పాఠకునిలో రేకెత్తిస్తుంది. ప్రస్తుతం వెలువడుతున్న విమర్శలో అత్యధిక భాగం వస్తు చర్చకే పరిమితమై శిల్పాన్ని పట్టించుకోని తీరు కన్పిస్తుంది.

**విమర్శకుని సహనం చాలా అవసరం. ఓర్పుగానేర్పుతో విమర్శ చేయాలి. ఆవేశంతో త్వరపడి నిర్ణయం ప్రకటించడం అంత మంచిది కాదు. విమర్శకునికి తన ప్రాంత భాషలోని గ్రంథాల పరిచయం మాత్రమే ఉంటే సరిపోదు.**

విమర్శ రచన పట్ల అవగాహనను పెంపొందించాలి. ఏది ఉత్తమ సాహిత్యమో, ఏది కాదో నిరూపించాలి. అప్పుడు పాఠకులు ఉత్తమ సాహిత్యం వైపుకు మొగ్గు చూపే అవకాశం కలుగుతుంది. కానీ నేడు విమర్శకులు తమకున్న సైద్ధాంతిక విభేదాల వల్ల తాము నమ్మే సిద్ధాంతాన్ని రచనలకు బలవంతంగా ఆపాదిస్తూ నిర్ణయాలు ప్రకటిస్తున్నారు. రచయిత యొక్క దృక్పథాన్ని వెల్లడించడం కంటే తమ సైద్ధాంతిక దృక్పథ బలాన్ని వెల్లడించడానికే విమర్శకుడు ఉత్సాహం చూపుతున్నారు. ఇది పాఠకుడిని సందిగ్ధావస్థకు తీసుకొని వెళ్తుంది. సాహిత్య పఠనంలో పాఠకులకు అడుగడుగున ఎదురయ్యే సందేహాల్ని నివృత్తి చేసి సాహిత్యాన్ని బాగా అర్థం చేసుకొని ఆనందించేటట్లు చెయ్యాల్సిన బాధ్యత విమర్శకునిపై ఉంది. ఐతే నేడు వెలువడుతున్న విమర్శ సందేహ నివృత్తి చేయడం అటుంచి, పాఠకుడిని సందేహ సముద్రంలో ముంచుతుందనే విమర్శ కూడా ఉంది. కొందరు విమర్శకులు తమ హేతుబద్ధం గానీ పిడివాద విమర్శలతో పాఠకులను అపసవ్య మార్గంలో పయనింపజేసే ప్రయత్నం చేస్తుండటం దురదృష్టకరం.

ఉత్తమ విమర్శ పాఠకులకు విజ్ఞానాన్ని, వికాసాన్ని అందిస్తుంది. ఇది పాఠకునికి అందించాలంటే విమర్శకుడు బహుముఖ ప్రజ్ఞాశీలి అయి ఉండాలి. కవి వివిధ శాస్త్ర పండితుడైతే ఆ విమర్శకుడు అంతకు మించిన శాస్త్ర కళా పరిజ్ఞానం కలిగిన వాడే ఉండాలి. తెలుగు ప్రాచీన సాహిత్య ప్రక్రియలైన కావ్యాలు, పురాణాలు, ఇతిహాసాలు, ప్రబంధాల మీద గొప్ప విమర్శలు వెలువడ్డాయి. ఇందుకు కారణం నాటి విమర్శకులు అపార పాండిత్య ప్రకర్ష కలవారు కావడమే. కానీ నేటి విమర్శకులలో అంతటి పరిజ్ఞానం కలిగిన వారు చాలా తక్కువమందే ఉన్నారు. నేటి విమర్శకులలో విశాల దృష్టి కంటే అహంభావ దృష్టి ఎక్కువగా కన్పిస్తుంది. కావ్యం కన్నా తన విమర్శే మిన్నగా ఉందనే సంకుచిత భావం నుండి నేటి విమర్శకుడు బయటికి రావాలి. నచ్చిన విషయాలను, నచ్చని విషయాలను సమదృష్టితో విమర్శకుడు చాటాలి.

నేటి విమర్శకులు కేవలం ప్రాచీన సాహిత్యాన్ని సంప్రదాయ దృష్టితోనే పరిశీలించి, విమర్శనా మూసలో పరిచయానికే పరిమితమైపోతున్నారు. ఆయా సాహిత్య ప్రక్రియల అంతర్గత అంశాలపై దృష్టి సారించలేకపోతున్నారు. విమర్శ పామరులైన పాఠకులకు, పండితులైన రచయితలకు మధ్య మధ్యవర్తిత్వం కలిగించే వారధిలా ఉండాలి. సద్విమర్శ రచయిత హృదయానికి దగ్గరగా పఠితను చేరుస్తుంది. ఏ అనుభూతి పొంది కవి కావ్యం సృష్టించారో అదే అనుభూతిని పాఠకునికి కలిగించి ఆనందాన్నిస్తుంది. ఇందుకు విమర్శకుడు సహృదయత కలిగివాడై ఉండాలి. జాతి, కుల, మత, ప్రాంత, సిద్ధాంత పక్షపాతాల మధ్య నేటి విమర్శకుల సహృదయత చిన్నబోతుంది. విమర్శకుడు తన, పర భేదం లేని వాడుగా ఉండాలి. నచ్చిన పుస్తకాన్ని ఒక విధంగాను, నచ్చని పుస్తకాన్ని మరో విధంగాను చూడకూడదు. ఈ సమదృష్టి నేటి విమర్శకులలో కొరవడిందనే వాదన వినిపిస్తుంది.

విమర్శకుని సహనం చాలా అవసరం. ఓర్పుగానేర్పుతో విమర్శ చేయాలి. ఆవేశంతో త్వరపడి నిర్ణయం ప్రకటించడం అంత మంచిది కాదు. విమర్శకునికి తన ప్రాంత భాషలోని గ్రంథాల పరిచయం మాత్రమే ఉంటే సరిపోదు. వివిధ లోక జనవ్యవహారంతో పాటు ప్రాపంచికానుభవం కూడా చాలా అవసరం. ఐతే నేడు వెలువడుతున్నవిమర్శను గమనిస్తే ఓర్పు, పరిశ్రమించే సామర్థ్యం, ప్రాపంచికానుభవం తదితర అంశాలను యువ విమర్శకులు పుణికిపుచ్చుకోవాల్సిన అవసరం ఉందనిపిస్తుంది. సాహిత్య విలువలు, ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని సమకాలీన సమాజంలో

వచ్చే మార్పులను అంచనా వేయగల సామర్థ్యం విమర్శకునిలో ఉండాలి. సమకాలీన సామాజిక, ఆర్థిక, మత, రాజకీయ, సాంస్కృతిక పరిస్థితులను అవగాహన చేసుకొని సమ సమాజ క్షేమం కోసం సామాజిక స్పృహతో విమర్శ కొనసాగిస్తున్న విమర్శకులు నేడు కరువయ్యారు.

**సాహిత్యమైనా, సాహిత్య విమర్శ అయినా బలహీనుల పక్షాన నిలబడాలి. నిజాయితీకి కొమ్ము కాయాలి. సమాజ శ్రేయస్సే ధ్యేయంగా ఈ రెండు ప్రక్రియలు ముందుకు సాగాలి.**

ఆధునిక సాహిత్యంపై ఆంగ్ల భాషా ప్రభావం ఆది నుండి ఉంది. తెలుగు సాహిత్య విమర్శపై కూడా ఆంగ్ల సాహిత్య ప్రభావం ఉంది. ఆధునిక సాహిత్యంలో నేడు పురుడు పోసుకుంటున్నవినూత్న వాదాలు, ఉద్యమాలు, వస్తువుల వెనుక ఆంగ్ల సాహిత్య ప్రభావం ఉందనుటలో ఎటువంటి సందేహం లేదు. ఈ సాహిత్యాన్ని విమర్శించాలంటే ఆంగ్ల సాహిత్యంలో వెలువడుతున్న విమర్శలపై కూడా విమర్శకుడు అవగాహన పెంపొందించుకోవాల్సిన అవసరం ఉంది. ఈ అవగాహన లేకుండా కొందరు విమర్శకులు సాహిత్య ప్రక్రియలను సంప్రదాయ విమర్శ ప్రమాణాలతో కొలిచే ప్రయత్నంచేస్తున్నారు. సాహిత్య లోకంలో ఒక కవి యొక్క స్థానాన్ని నిర్ణయించడానికి, రచన యొక్క విలువను వెల్లడించడానికి తులనాత్మక విమర్శ ఎంతగానో దోహదపడుతుంది. ఇందుకు విమర్శకునికి ఇతర భాషా సాహిత్యాలపై సైతం పట్టుండాలి. అంతటి సామర్థ్యం నేటి విమర్శకులకు ఎంతమందికున్నదనేదే ఇప్పుడు ప్రశ్న.

నేడు సాహిత్య విమర్శ చాలా క్లిష్టమైన ప్రక్రియగా మారింది. కుల, మత, సిద్ధాంత ప్రాతిపదికన కవులు, విమర్శకులు విడిపోయి గ్రూపులుగా విమర్శ, ప్రతివిమర్శలు చేసుకుంటున్నారు. ఒక కులంవారి లేదా ఒక మతం వారి సాహిత్యాన్ని మరో కులం వారు, మరో మతం వారు సమీక్షించి, విశ్లేషించి అందులో లోపాలు ఎత్తి చూపితే ఆ వర్గీయులు మూకుమ్మడిగా భావ దాడికి దిగుతుండటం సర్వసాధారణమైపోయింది. కువిమర్శముందు, కుటిల సమీకరణాల ముందు, కులమతాలను సమర్థించే సాహిత్యం ముందు నేటి సాహిత్య విమర్శ సజీవత్వాన్ని కోల్పోతుంది. నేడు సాహిత్య విమర్శ బలహీనం కావడంలో రచయితల పాత్ర కూడా ఉంది. నేడు రచయితలు కుల, మత, వర్గ, లింగ రూపాలుగా విడిపోయి అస్తిత్వ వాదాల ముసుగులో కుల, మత, వర్గ, లింగ బేధాల్ని నిద్రలేపే ప్రయత్నం చేస్తున్నారనే ఆరోపణలు అధికంగా వినిపిస్తున్నాయి. రచయితలు తమ రచనలపై వచ్చే విమర్శలను స్వాగతించడానికి ఎప్పుడూ సిద్ధంగా ఉండాలి. కానీ నేటి రచయితలలో ఆ స్వీకరణ కొరవడుతుంది. నిజమైన స్వచ్ఛమైన విమర్శను భరించే సహృదయత కవులు, రచయితలు కలిగి ఉండాలి. అప్పుడే సాహిత్య విమర్శ ఎదుగుతుంది. నేడు విశ్వవిద్యాలయాల నుండి వెలువడుతున్న తెలుగు పరిశోధన సిద్ధాంత గ్రంథాలలో నాణ్యతతో కూడిన విమర్శ వెలువడటం లేదు. అనేకమంది పరిశోధకులు విమర్శ కొలమానాలపై అవగాహన లేకుండానే గ్రంథాలను సమర్పించి డిగ్రీలు పొందుతున్నారు. పరిశోధన పర్యవేక్షకులు కూడా ఈ అంశాలపై విద్యార్థులకు అవగాహన కల్పించడం లేదు.

పైన పేర్కొన్న అంశాల దృష్ట్యా నేడు విమర్శ అసలే లేదని, వస్తున్న విమర్శ అంతా అధ్వాన్నంగా ఉందని చెప్పడం నా ఉద్దేశ్యం కాదు. సాహిత్య విమర్శకులలో చాలా మందికి నిర్దిష్టమైన భావజాలం లేకపోవడం వల్ల, నిరంతరం మారుతూ వస్తున్న ఆధునిక సాహిత్య వాదాలను అంచనా వేసే తూకపురాళ్ళు కావాల్సినన్ని రూపొందకపోవడం కూడా నేడు వస్తున్న విమర్శ పట్ల అసంతృప్తి కలగడానికి ప్రధాన కారణంగా పేర్కొనవచ్చు. అయితే తీవ్ర నిరాశ పడాల్సినంత అధ్వాన్నంగా మాత్రం నేటి విమర్శ లేదనేది మాత్రం వాస్తవం. నేటికి పదునెక్కిన, లోతైన విమర్శ చేస్తూ ముందుకు సాగుతున్న విమర్శకులు ఉన్నారు.

సాహిత్యమైనా, సాహిత్య విమర్శ అయినా బలహీనుల పక్షాన నిలబడాలి. నిజాయితీకి కొమ్ము కాయాలి. సమాజ శ్రేయస్సే ధ్యేయంగా ఈ రెండు ప్రక్రియలు ముందుకు సాగాలి. తప్పును తప్పుగా, ఒప్పును ఒప్పుగా వెల్లడించే ధైర్యాన్ని విమర్శకుడు అలవర్చుకోవాలి. సాహిత్యానికి దిక్సూచిగా విమర్శ ఉండాలి. విమర్శకుని పని రంధ్రాన్వేషణ కారాదు. గుణములున్న చోట స్వల్పమైన దోషములను పరిగణించకూడదు. అట్లాగని దోషములనే పేర్కొనకూడదని

# మా శరీరమే....

- బుర్రా సాయిబాబు
9291291751



స్థూలకాయం ప్రపంచ సమస్యా?
సోనాబెల్టులనుంచి బెరీయాట్రిక్ కోతవరకూ
గ్రీన్ కాఫీ నుంచి యెల్లో టీ దాకా
మనుషుల్ని సన్నబరిచే ప్రతి వ్యాపార ప్రకటనకు
లొంగుతూనే ఉన్నాం
మీ ప్రకటనలు చూసీ చూసీ
సంఘం నుంచి వెలివేయబడ్డ మరొకజాతి
కొత్తగా ఉద్భవించింది అనిపిస్తోంది
లావుగా ఉండడం కన్నా
ఫెరిగిన బరువు మా వ్యక్తిత్వాన్ని మా నుంచి దూరం
చేస్తోంది
తెలియని మానసిక అనారోగ్యాన్ని తెస్తోంది
మీ ప్రకటనల పుణ్యమా అని
ప్రతి పలకరింపూ వ్యంగ్యంగానే వినిపిస్తోంది
చివరికి అద్దం కూడా..ఒకసారి సన్నబడ్డట్లే చూపించి
మరొకసారి అసహ్యంగా ప్రతిబింబిస్తోంది
మా శరీరపు బరువుని వెక్కిరించి వెక్కిరించీ
మీ గల్లాపెట్లు బాగానె లావెక్కిస్తున్నారుగా
అయినా మోసుకెళ్ళే వాహనాలు కాల్చే యంత్రాలు వచ్చాకా
మా శరీరం ఏ నలుగురికీ బరువుకాదు
అంతవరకూ మమ్మల్ని మనస్పూర్తిగా బ్రతకనివ్వండి ♦

కాదు. గుణదోషాలను సమదృష్టితో విచారించువాడే ఉత్తమ విమర్శకుడు. రాగద్వేషాలకు విమర్శకుడు అతీతుడై నిష్పక్షపాత బుద్ధితో సాహిత్యతత్త్వ వివేచనకి సిద్ధపడాలి. విమర్శకునికి సానుభూతి చాలా ముఖ్యము. పూర్వ సిద్ధాంతములకు లోబడక, స్వీయాభిప్రాయాలకు తావీయక విమర్శ చెయ్యాలి. ప్రాచీన సాహిత్యాన్ని నవీన దృష్టితోగాని, ఇతిహాస పురాణాలను కావ్యదృష్టితో గాని, దేశీ సాహిత్యాన్ని విదేశీయ దృష్టితో గాని పరిశీలించే ప్రయత్నం చేయరాదు.

సమాజం మారుతుంది, దాని ప్రతిఫలనమైన సాహిత్యమూ మారుతుంది. మారిన సాహిత్యాన్ని విమర్శించడానికి కొత్త సూత్రాలను నిర్మించుకునే కార్యాచరణలో విమర్శకుడు ఎల్లప్పుడూ సిద్ధంగా ఉండాలి. పూర్వ విమర్శకులు, తన సాటి విమర్శకులు రాసిన రాస్తున్న సాహిత్య విమర్శలోని మంచిచెడులను విశ్లేషించడం, సాహిత్య విమర్శ లక్షణాలను, స్వరూప స్వభావాలను వివరిస్తూ విమర్శపై విమర్శ విరివిగా నేడు రావాలి. మంచి సమాజం ఏర్పడాలంటే మంచి సాహిత్యంరావాలి. మంచి సాహిత్యం రావాలంటే మంచి విమర్శ రావాలి. మంచి సాహిత్య విమర్శ రావాలంటే విమర్శ కూడా విమర్శకు గురి కావాలి. సాహిత్యము, సాహిత్య విమర్శ, విమర్శపై విమర్శ అన్నీ కలిసి మంచి సమాజ నిర్మాణానికి దోహదం చేస్తాయి. సాహిత్య విమర్శకు మూల్యాంకనము, పునర్మూల్యాంకనమూ రెండూ నేడు అవసరమే. రచనకు విలువ కట్టడం మూల్యాంకనమైతే, మారిన సామాజిక సందర్భంలో కొత్త విమర్శ సూత్రాలతో ఆ రచనను తిరిగి అంచనా కట్టడం పునర్మూల్యాంకనము. పునర్మూల్యాంకనం లేకపోతే సాహిత్య విమర్శ స్తబ్దతకు లోనయ్యే ప్రమాదం ఉంది.

తెలుగు సాహిత్య విమర్శకులు పోతున్న పోకడలను ఎప్పటికప్పుడు విశ్లేషించుకొని మంచి, చెడులు చర్చించకపోతే పిడి వాదానిదే పైచేయి అయ్యే ప్రమాదం ఉంది. సాహిత్యం అపసవ్య మార్గంలో ముందుకుసాగుతుంది. అందువల్ల భవిష్యత్తులోనైనా తెలుగు సాహిత్య విమర్శకులు చక్కని ప్రమాణాలతో సాహిత్య విమర్శ చేయాలనీ, గాడి తప్పుతున్న సాహిత్యాన్ని, రచయితల ఆలోచనలను సక్రమమైన మార్గంలో పయనింపచేయాలనీ - ఆ విమర్శలను రచయితలు స్వాగతించాలనీ, విమర్శపై వెలువడే విమర్శల పట్ల విమర్శకులు సైతం సానుకూలంగా స్పందించాలనీ - చైతన్యవంతమైన సమాజ నిర్మాణంలోరచయితలు, విమర్శకులు భాగస్వాములు కాగలరని ఆశిద్దాం. ♦

## పచ్చని చెట్టులా.....

- పొనుగుమట్ల అశోక్ కుమార్
9959379709



మా ఊరికి వెళ్లాను
నన్ను నేను తరచి చూసుకోవడానికి
పుట్టి పెరిగిన మా ఊరికి వెళ్లాను
నాలోకి నేను ప్రవేశించినట్టు.....

ఊరిలో పాదం మోపగానే
ఆబగా ఊరంతటినీ చూపులతో
పలకరించి
నా కళ్లల్లోకి ఊరిని నింపుకొని
కంటి రెప్పలతో ఆలింగనం
చేసుకుంటాను

అప్పుడు నేను
పురిటి మంచం మీద
శిశువులా వుంటాను
అమ్మ ఒడిలాంటి ఊరిదేహంలో
పసివాడిలా ఒదిగిపోతాను

వర్షంలో తడిసిన పక్షి
తన ముక్కుతో రెక్కలను
సుతారంగా తడిమి చూసుకున్నట్టు
నన్ను నేను తరచి చూసుకుంటాను

ఊరిలో గుప్పెడు మట్టిని
చేతుల్లోకి తీసుకొని
ఆ మట్టిలో కలిసిపోయిన అమ్మను
తడి నిండిన హృదయంతో దర్శించుకుంటాను
తల్లి పాలలాంటి బాల్యం జ్ఞాపకాలను
కాసేపు నెమరు వేసుకుంటాను
ఊరిజనం ఆత్మీయ పలకరింపుల్ని
దండగుచ్చి మెడలో వేసుకుంటాను

అప్పుడు
నాలో ఏదో జీవశక్తిని నింపుకున్నట్టు
నన్ను నేను బ్రతికించుకున్నట్టు
గడిచిపోయిన బాల్యాన్ని
నా చేతుల్లోకి తీసుకున్నట్టు
ఏవేవో అనుభూతుల మంచుతెరలు
చల్లగా నన్ను కమ్ముకుంటాయి

ఎండిన మోడులా ఊరికి వెళ్లిన
వాడిని
కొత్త చిగురు తొడిగిన
పచ్చని చెట్టులా తిరిగొస్తాను. ◆

## అతనొక దర్జీ

- పెంకి విజయ కుమార్
9553392949

పిలుపుకు మాత్రమే అతనొక దర్జీ!కానీ....
దైవానికీ,దేహానికీ ఆధ్యాత్మిక బంధంలా
పెద్ద చక్రానికీ,చిన్న చక్రానికీ
అనుసంధాన జంధ్యం వేసే గొప్ప పురోహితుడు
మిషన్ హెడ్ పై చిన్ని జండాకర్రలా ఉన్న ఊచకు
దారపు కండెను నిలిపి సెల్యూట్ చేసే దేశభక్తుడు

రెప్పల్లో తొట్రుపాటు లేకుండా
వస్త్రఅంచుల్లో కుట్టును చేజారనివ్వని
సరిహద్దు సైనికుడు
అనవసరపు గుడ్డను తెరమరుగు చేసి
ముక్కకు,ముక్కను జతచేసే ఆధునిక శుశ్రుతుడు
కాజా గాట్లచుట్టూ రంగుదారాలతో రైతులా కంచెవేసి
లిల్లీపుట్ యుద్ధవీరుని చేతిలో ఢాలులాఉన్న
గుండీలతో స్నేహం కుదిర్చే మానవతావాది
తాను కుట్టిన దుస్తుల్లో దూరిన దేహాలకు
నిలువెత్తు గౌరవం ఆపాదించే ఉన్నత సంస్కారి



ఇన్ని నైపుణ్యాల మొనగానిపై
శత్రు సైనికులల్లే
పెట్టుబడిదారీ బడాబాబుల
రెడీమేడ్ దుస్తుల విపత్కర దాడి
ప్రపంచీకరణ బల్లెపుపోటుకు
మిషన్ చక్రం వ్రక్కలు, విరిగిన సూది
తెగిన దారం
ఒంట్లో ఆకలి దేవుని హాహాకారాలు
ఇంట్లో దరిద్రదేవత తాండవాలు
ఆత్మహత్యలే ఆపద్బాంధవులు

పాలకులారా!
ఒక్కసారి మీ దృష్టి ఇటు మరల్చండి
చేతివృత్తులకు చేయూతనందించండి
నాణ్యతా,నైపుణ్యాల వెన్నులు తట్టండి
దర్జీల బతుకుల్లో దరహాసం నింపండి ◆

# వర్తమాన మానవ జీవన ప్రతిబింబాలు




- మందరపు హైమవతి
9441062732

కవిగా, రచయితగా జంధ్యాల రఘుబాబు సాహితీలోకానికి సుపరిచితులు. ఇప్పుడు 'పెట్టుడు రెక్కలు' కథా సంపుటితో పాఠకుల ముందుకు వచ్చారు. ఈ సంపుటిలోని కథలన్నీ ఆధునిక సంక్లిష్ట సమాజానికి దర్పణాలు.

మంచి కథలెప్పుడూ సమకాలీన జీవితాన్ని ప్రతిబింబిస్తాయి. ఈ సంపుటిలోని పది కథలూ అలాటి సామాజిక సమస్యల చిత్రీకరణలే. 'ఆ రెండు గంటలు' కథ ఇటీవల హైదరాబాదు, దిల్‌సుఖ్‌నగర్ ప్రేలుళ్ళ గురించి రాసినది. సరోజ, శారద ఇద్దరూ స్నేహితురాళ్ళు. ఆ రోజు బట్టలు కొనడానికి దిల్‌సుఖ్‌నగర్‌కు వెళ్తారు. కొనడం ఐపోయాక సరోజ ఇంటికి వెళిపోతుంది. శారద కూరగాయల మార్కెట్‌కు వెళ్తుంది.

సరోజ ఇంటికి వెళ్ళగానే టి.వి.లో దిల్‌సుఖ్‌నగర్ ప్రేలుళ్ళ గురించి వార్తలు వస్తుంటాయి. సరోజకు కంగారు మొదలువుతుంది. తన స్నేహితురాలు ఎలా వుందోనని విపరీతమైన టెన్షన్ పడుతుంది. ఉగ్రవాదుల్ని తిట్టుకొంటుంది. ఈ చర్యలకు పాల్పడిన ముస్లింలను ద్వేషిస్తుంది. అంతలోనే తనకు ఫోను వస్తుంది. "ఇక్కడ ఎవరో అమ్మాయికి దెబ్బలు తగిలి హాస్పిటల్లో వుంది" అని. సరోజ భర్తను తీసుకొని మార్కెట్ పక్కనున్న ఆస్పత్రికి వెళ్తుంది. స్నేహితురాల్ని ప్రాణాలతో చూసి కుదుటపడుతుంది. స్నేహితురాలి గది బయట ఒక ముస్లిం వృద్ధుడుంటాడు. స్నేహితురాలి వృత్తాంతం చెప్పింది కూడ అతడే. అప్పటి వరకు ఉగ్రవాదులను, ముస్లింలను తిట్టుకొన్న సరోజ ఆ సంఘటనను చూచి చలించిపోతుంది. అనవసరంగా ముస్లింలను తిట్టానే అని బాధపడుతుంది. తన ఆలోచనలను మార్చుకొంటుంది. మంచితనం, మానవత్వం కలిగిన వాళ్ళు అన్ని మతాల్లోనూ వుంటారని, కేవలం ఒక మతం వాళ్ళు కానీ, ఒక కులం వాళ్ళు కానీ చెడ్డవాళ్ళు అనుకోవడం మన పొరపాటు అనుకొంటుంది.

ఆ రెండు గంటల్లో స్నేహితురాలి కోసం సరోజ పడిన క్షోభను, ఆమెలోని మారిన ఆలోచనా విధానాలను కథకుడు కళ్ళకు కట్టినట్లు వివరిస్తారు. ఒక మతంలోనో, ఒక కులంలోనో పుట్టినంత మాత్రాన అందరినీ దుర్మార్గులు అనుకోకూడదు. స్వప్రయోజనాల కోసం కొందరు స్వార్థపరులు మత విద్వేషాలు, కులబేధాలు రెచ్చగొడతారే కానీ మనుషుల్లో మానవత్వానికి కొదువలేదని, సందర్భాన్ని బట్టి, సమయాన్ని బట్టి బయటకు వస్తుందని కథకుడు విశదీకరిస్తాడు.

'పెట్టుడు రెక్కలు' ఆలోచనలు రేకెత్తించే కథ. ఈ రోజుల్లో ఇంటికొకరు అమెరికాకు వెళ్తున్నారు. చదువంటే ఎంసెట్, ఉద్యోగమంటే అమెరికా అనే భావాలు ప్రజల మనసుల్లో

ప్రగాఢంగా నాటుకుపోయాయి. ఈ కథలో 'రాఘవ' అనే అబ్బాయి తన బాబాయికి ఉత్తరం రాస్తాడు. బాబాయి పిల్లలు విదేశాల్లో ఉద్యోగాలు చేస్తుంటారు. బాబాయి ఇక్కడి వాళ్ళకు సరియైన ఉద్యోగాలు లేవు. జీతాలు లేవు అని ఎగతాళి చేస్తుంటాడు.

విదేశాల్లో ఉద్యోగాలు చేయగానే సరిగాదు. ఎన్ని లక్షలు సంపాదించినా ఆనందం వుండదు. పొద్దుటి నుంచి రాత్రి వరకు ఉద్యోగపు ఒత్తిడితో మనశ్శాంతి వుండదు. అని అబ్బాయి అంటాడు.

పక్షి తన సహజమైన రెక్కలతో ఎంత ఎత్తైనా ఎగురుతుంది. పెట్టుడు రెక్కలతో ఎగరలేదు గదా! అలాగే మానవుడు తాను పుట్టి పెరిగిన మాతృదేశాన్ని, తన సంస్కృతిని వదలగూడదు. పక్షుల్లా పాశ్చాత్య దేశాలకు ఎగిరి వెళ్ళి ధనార్జన చెయ్యగలరు గానీ ఆనందం రెక్కలు పొందలేరు గదా! మన మట్టి, మన గాలి, మన నీరు, మన భాష, మన వాళ్ళు వీటిలోని ఆనందం కరెన్సీ కాగితాల రెపరెపల్లో కనిపించదని రచయిత అంటారు.

మనసును కదలించే మరోకథ 'చాక్లెట్ అంకుల్'. ఇప్పుడు నగరాల్లో అపార్టుమెంటు సంస్కృతి విస్తరించింది. అనేక కుల మతాల ప్రజలు ఒకే అపార్టుమెంటులో జీవిస్తున్నారు. ఇప్పుడు అపార్టుమెంటే ఒక దేశానికి నమూనా. 'చాక్లెట్ అంకుల్' ఒక అపార్టుమెంటుకు సంబంధించిన కథ. కర్నూలులో రద్దీగా వుండే గౌలిగేరి ప్రాంతంలో ఒక అపార్టుమెంట్‌లో ఒక ఫ్లాట్ ఖాళీ అవుతుంది. దానిలోకి విల్సన్ వస్తాడు. అతడు ఒంటరివాడు. అతనికి ఫ్లాటు ఇవ్వడం మిగిలిన వారికెవరికీ ఇష్టం వుండదు. ఆ అపార్టుమెంట్‌లోనే మున్నీ అనే చిన్న పిల్లను అభిమానిస్తాడు. ఆ పిల్లకు చాక్లెట్ ఇస్తాడు కానీ తిరిగి ఇచ్చేస్తుంది. కొంతకాలమయ్యాక ఆ పిల్ల మనసులో స్థానం సంపాదిస్తాడు. చాక్లెట్ అంకుల్ అని పేరు తెచ్చుకొంటాడు.

ఈనాడు కొన్ని పరిస్థితుల వలన మనం ఎవరినీ నమ్మలేకపోతున్నాం. ఇంటికి కొత్తవాళ్ళు ఎవరైనా వస్తే దొంగలుగానో, దోపిడీదార్లుగానో చూస్తున్నాం. తోటి మనిషి మీద నమ్మకం కోల్పోవడంలోని విషాదాన్ని ఈ కథ పట్టుకుంది.

ఇప్పుడు చాలామంది పాత వస్తువులంటే ఇష్టపడరు. ముసలి వాళ్ళను ఇష్టపడరు. ఆధునిక వస్తువులను కొనుక్కోవచ్చు గదా పాతవాటిని పారేసి అంటారు. ఇదే 'ఉయ్యాల' లోని కథా వస్తువు. శ్రీనాథ్ ఇల్లు ఖాళీ చేస్తున్నాడు. ఇంట్లో పాత చెక్క ఉయ్యాల వుంటుంది. పిల్లలు దాన్ని కొత్త ఇంటికి తీసుకువెళ్ళద్దు. వదిలెయ్యమని చెప్తారు. పిల్లల్ని ఒప్పించి ఈ ఒక్కసారికేనని ఉయ్యాలను కొత్త ఇంటికి తీసుకువెళ్తాడు. ఉయ్యాల మీద మమకారమెందుకని పిల్లలు తండ్రిని అడుగుతారు. ఒకరోజు చెత్తకుండీలో పడేసిన పిల్లను వాళ్ళ అత్తమామలు పెంచిన తీరుని, ఆ పిల్లకు వాళ్ళ మామయ్య ఉయ్యాలను కానుకగా ఇచ్చారని ఆ ఉయ్యాల్లో పెరిగి పెద్దయిన పిల్లే అమ్మ అని పిల్లలకు అసలు విషయం చెప్తాడు తండ్రి.

ప్రతి వస్తువుతో మనిషికి అనుబంధం వుంటుంది. ఒక్కొక్క వస్తువు వెనక అనేక జ్ఞాపకాలు వుంటాయి. అనేక సంఘటనలు వుంటాయి. పొగడపూల పరిమళాలలాగా ఆ అనుభూతులు మదిలో పరిమళిస్తుంటాయి. మనసుకు హత్తుకొనేలా ఆ అనుభూతులను చిత్రిస్తారు ఈ కథలో రచయిత.

మనసుల్ని కదలించే మరో కథ 'ఒరే అంజి'. ఒక ప్రభుత్వ కార్యాలయంలో తాత్కాలిక అటెండరు అంజి. ఉదయం తొమ్మిదింటికి వస్తే రాత్రి ఏడున్నర వరకు ఆఫీసులో అన్నిపనులు చేస్తాడు. ఆఫీసులో ఎవరి వస్తువులు మరిచి పోయినా తెచ్చిస్తాడు. ఒకసారి సూర్యనారాయణ అనే ఉద్యోగి స్మార్టుఫోను పోతుంది. ఆయనకు అంజి మీదే అనుమానం. అంజి తియ్యలేదని చెప్పినా నమ్మడు. పైగా తిడతాడు. తర్వాత కొన్నిరోజులకు ఆఫీసులో తనిఖీ జరిగినపుడు ఫైళ్ళ మధ్యనుంచి ఫోను జారిపడుతుంది. అప్పుడైనా అంజితో 'పొరపాటయింది' అని అనడు.

మనది ధనస్వామ్య దేశం. ధనికులు పేదవాళ్ళని చాలా చులకనగా చూస్తారు. వాళ్ళింట్లో ఏ వస్తువు పోయినా, వీళ్ళే తీసారని అంటారు. అలాగే అటెండరు నారాయణ పేదవాడు కాబట్టి వాడే ఫోను తీసుంటాడని అనుకొంటాడు. సమాజంలో గొప్పవాళ్ళనుకొనే కొందరి అహంకారాన్ని ఎండగట్టారు ఈ కథలో.

ఈ సంపుటిలో మరో కథ 'కాడెద్దు' నాగరికత పెరుగుతున్న కొద్దీ మానవ జీవితంలో యంత్రాలకు ప్రాముఖ్యం పెరిగింది. ఆఖరికి వ్యవసాయ రంగంలో కూడా యంత్రాలు వచ్చాయి. మానవ సంపద ఎక్కువగా వున్న మనదేశం కూడా, యంత్ర వినిమయంలో పాశ్చాత్య దేశాలతో పోటీ పడుతుంది. ఒకప్పుడు ఎద్దులస్థానే ఇప్పుడు ట్రాక్టర్లు వచ్చాయి. ఇప్పుడు పంటలు కోసే యంత్రాలు కూడా వచ్చాయి.

# నల్ల జాబిల్లి

- శిఖా - ఆకాష్
7095874172



వేకువెంత
దూరమో
రేయికే తెలుసు -

జీవితమెంత
పోరాటమో
ఆశకే తెలుసు -

రేయి ఎంత
అందమో/తీయనో
విరహానికే తెలుసు -

మనసు ఎంత
గంధమో
ప్రేమకే తెలుసు -

గాయమెంత
మధురమో
సృజనకే తెలుసు -

ఆశ ఎంత
శ్వాసో
విజయానికే తెలుసు -

విరహమెంత
వేదనో
మనసుకే తెలుసు -

ప్రేమ ఎంత
బంధమో
గాయానికే తెలుసు -

సృజన ఎంత
చిత్రమో/ సహజమో
జీవితానికి తెలుసు -

విజయమెంత
విలువైనదో/ అరుదైనదో
ఓటమికే తెలుసు -

---

కాడెడ్లులో నారాయణ ఒక రైతు. పొలం, పశువులు తనకి ప్రాణం. కానీ వ్యవసాయం గిట్టుబాటు కాక పట్నానికి వచ్చేస్తాడు. ఒక ఎద్దు మాత్రం మిగులుతుంది. ఆ ఎద్దును బండికి కట్టి ఇసుక తోలుతాడు. ఒకప్పుడు భూస్వామి నాగిరెడ్డి ట్రాక్టరుతో తన ఎద్దుల్ని పోటీ పెట్టినప్పుడు తన ఎద్దులే గెలుస్తాయి. కానీ ఇప్పుడు ఎడ్లతో పాటు ముసలి వాడైపోతాడు. ఉన్న ఒక ఎద్దు కూడా మరణిస్తుంది. ఎద్దు పోయినాక భార్యా భర్తలిద్దరూ విచారిస్తారు.

మనిషికి పశువులతో అనుబంధమెక్కువ. మనుషులకంటే మూగజీవులకు అభిమానమెక్కువ. గడ్డి తిని మనుషుల పట్ల విశ్వాసంగా వుంటాయి. కానీ బుద్ధిజీవియైన మనిషి మాత్రం తనకు మేలు చేసిన వారికే కీడు చేస్తాడు.

మరో కథ 'మరోపొద్దు'. ఎన్ని సమస్యలున్నా మనిషి ఆశాజీవిగా వుండాలనే సందేశమిస్తుంది. మధు రోజూ గడ్డం గీసుకుంటూ 'ఒక్కొక్క రోజు తరిగిపోతుంది' అనుకొంటాడు. కానీ చివరకు తన ఆలోచనా దృక్పథం మార్చుకొంటాడు. 'మరొక రోజు మొదలవుతుంది' అని ఆశావహం ఆలోచనలకు తెరతీస్తాడు.

'బొమ్మల కొలువు' స్త్రీవాద దృక్కోణంతో రాసిన కథ. ఇరవై ఒకటో శతాబ్దమే వచ్చినా ఇంటర్‌నెట్ యుగమే వచ్చినా మనిషి ఆలోచనా విధానం మారదు. మూలాలు మారవు. గుడ్డి నమ్మకాలకు, మూఢ విశ్వాసాలకు బానిసలు మధ్యతరగతి వారు. ముఖ్యంగా చదువు కొని, ఉద్యోగం చేస్తున్నా మహిళల్లో మార్పురాదు. ఈ కథలో ఉమ, సత్యవతి బాల్య స్నేహితులు. 30 ఏళ్ళబట్టి వాళ్ళ స్నేహలత చిగురిస్తూనే వుంది. ఉమ భర్త చచ్చిపోతాడు. అప్పటి నుంచి ఆవిడ నెవరూ పేరంటాలకు పిలవరు.

హిందువుల్లో పెళ్ళిళ్ళలో, పేరంటాళ్ళలో వితంతువులకు తాంబూలాలు ఇవ్వరు. పసుపు కుంకుమ కూడ ఇవ్వరు. సత్యవతి ప్రతి సంవత్సరం దసరాకి బొమ్మలకొలువు పెడుతుంది. ప్రతి ఏడాది లాగానే ఉమని పేరంటానికి పిలిచి తాంబూలం ఇస్తుంది. కొందరు ముభావంగా వుంటే, కొందరు మెచ్చుకుంటారు. సంప్రదాయాలను మార్చాలనే సత్యవతి తపన ఈ కథలో ప్రధానాంశం.

ఈనాడు స్త్రీలు కాలు పెట్టని రంగం లేదు. విమానాలను నడుపుతున్నారు. రక్షణ రంగంలో, నౌకా రంగంలో బాధ్యతాయుతమైన పదవులు నిర్వహిస్తున్నారు. ఐనా ముత్తైదువలు, వితంతువులు అనే ముద్రలెందుకు ముఖం మీద. ఆలోచనల్లోనే కాదు, ఆచరణలో కూడ అభ్యుదయ భావాలుండాలి అని చెప్తుంది ఈ కథ.

ఈ సంపుటిలోని కథలన్నీ చదవదగినవి. రచయిత సమాజంలోని సమస్యలను, విభిన్న మానవ స్వభావాలను అత్యంత సహజంగా విశ్లేషించారు. ఆలోచనాత్మకమైనవి. మనసును మేలుకొలిపేవి. సరళమైన సంభాషణలతో పాఠకులను చదివిస్తాయి. కథల్లోని పాత్రలు మన జీవితంలో అడుగడుగునా తారసపడుతూనే వుంటాయి. ఈ పుస్తకం మూసివేసినా కొన్ని కథలు, అంజి, నారాయణ, చాక్లెట్ అంకుల్, సరోజ మొదలైన పాత్రలు మనను వెంటాడుతూనే వుంటాయి.

# సామాజిక, భావుకత్వ పరిమళం భగ్వాన్ కవిత్వం !

- డా॥ రాధేయ
8247523474



కవి ఒంటిరి కాదు, సమూహ స్వాప్నికుడు.

ప్రాపంచిక సుఖాల ప్రవాహంలో కొట్టుకుపోకుండా స్థిరంగా నిలబడగల ఆశావాది

అనేకానేక జీవన వైరుధ్యాల మధ్య పోరాటం సాగిస్తూ ప్రశ్నించే సందర్భాల్లో మౌనంగా ఉండలేని హేతువాది.

పతన విలువల ముందు మోకరిల్లనివాడు. స్వేచ్ఛగా మాట్లాడగల్గిన చలనశీలి కవి మాత్రమే.

సామాజికుల బతుకుకోణాల్లోకి నిర్భయంగా, నడిచిపోగలిగినవాడు. పల్లెసీమల శ్రమజీవనంలోని మట్టివాసనలకు, మట్టి మనుషుల గుండెలకు కరిగిపోయే స్వభావం కవిది మాత్రమే.

మానవ సంబంధాల విచ్ఛిన్నతలో, ప్రాపంచిక పరిణామాలు వేగంగా మారిపోతున్న కాలంలో తనేమిటో? తన గమ్యమేమిటో నిర్దేశించుకోగలిగినవాడు కవి మాత్రమే. కవి తన కవిత్వంతో పాఠకుల మానసిక పరిధిని విశాలం చేస్తాడు. జీవితంపట్ల గొప్ప ఆశను, విశ్వాసాన్ని కల్గిస్తాడు. ఈ నేపథ్యంలోంచి తెలుగు కవితాక్షేత్రంలో ఆరోగ్యవంతమైన ఫలాల్ని పండిస్తున్న అరుదైన అపురూపకవి భగ్వాన్.

భగ్వాన్ నాకు ఇష్టమైన కవి.

చక్కనైన సామాజిక కవిత్వానికి ఆయన రోల్‌మాడల్. మంచి పదునైన అభివ్యక్తి, ఆర్ద్రత, శిల్పంతో మేళవించిన కవిత్వం భగ్వాన్‌ది.

సమకాలీన తెలుగు కవుల్లో భగ్వాన్‌శైలి విశిష్టమైనది. పశ్చిమ గోదావరి జిల్లా తణుకు మండలంలోని మండపాకవారి నివాసం, వృత్తిరీత్యా ఉపాధ్యాయులు. ప్రవృత్తి రీత్యా తెలుగువారు మర్చిపోలేని నిండైన కవి. భగ్వాన్ వ్యక్తిగా అత్యంత సౌమ్యులు. మృదుభాషి, వారి కవిత్వం కుసుమ సౌందర్య కోమలం, కొమ్మల్లో కోయిల కవితాసోయగం.

అనుభూతుల పునాదిగా 'శబ్దాల్ని ప్రేమిస్తూ' :

భగ్వాన్ మొదటి కవితా సంపుటి శబ్దాల్ని ప్రేమిస్తూ 1991లో వెలువడింది. వారి కవితా ప్రస్థానానికి తొలి అడుగు

ఈ కవిత్వం. అనుభూతిని అందంగా, ఆకర్షణీయంగా చెప్పడం వీరి ప్రత్యేక కవితా లక్షణం.

ఈయన తన పుస్తకాల బీరువాను ప్రవహించే నదుల సంగమ సంద్రంలా భావిస్తారు. మనిషెలా బతకాలో కవిత్వమే నేర్పాలంటారు. కవిత్వం గుండెలకు చేరా వ్రని నస్తుందంటారు. ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం రాత్రి వేళల్లో తన ఇంటి నిజస్వరూపాన్ని ఎంతో అందంగా వర్ణిస్తారు. కలల దోసిళ్ళతో స్వప్న విహారం చేస్తారు. తన ఇంటి పనిమనిషి తొలిపిలుపు తన ఇంటి చీకటికి మేలుకొలుపుగా భావిస్తారు. మరో కవితలో 'పాలిష్‌వాలా'ను గురించి ఇలా రాస్తారు–


భగ్వాన్

***తన పిలుపును చిరుఆశతో కాళ్లకు అడ్డంపడే వాళ్ళకు***

***నిరాశను మోసుకెళ్ళేవారు/ బూట్లకు రంగుపులుముకున్న చేతులతోనే/ కట్టుకున్న దాని పెదాలపె/ నిట్టూర్పుల లిప్ స్టిక్‌ను అతికించేవాడు*** *(కవిత – పాలిష్‌వాలా : పుట : 27)*

దుఃఖం ఓ సెర్చిలైట్, దుఃఖం ఓ డైనమైట్ అనీ, మనిషనేవాడెప్పుడూ దుఃఖించాలంటారు.

***దుఃఖించే మనిషి భుజాల్ని తట్టొద్దు/ దుఃఖించే మనిషి వెన్నెముకని జాలితో నిమరొద్దు/ దుఃఖించే మనిషిని అక్కున జేర్చుకొని ఓదార్చొద్దు/ దుఃఖం లోనే మనిషి కళ్ళు తెరవాలి/ దుఃఖం లోనే మనిషి విరవాలి*** *(కవిత : దుఃఖం తర్వాత, పుట : 29)*

మనసుని గతానికీ వర్తమానాన్ని వంటికీ ఇవ్వడమే వృద్ధాప్యమని, అది ఒక నిషిద్ధ సామ్రాజ్యం. మానవ సంబంధాలకు మసిపూస్తుందనీ, మమతానుబంధాలను మసిచేస్తుందనీ భావిస్తారుకవి.

***"గాయలకు చిక్కిన హృదయాన్నీ/ రోగాలకు దక్కిన శరీరాన్ని/ జోలెగా చేసుకొని/ మృత్యుదేవతను భిక్ష అడగడమే వృద్ధాప్యం"*** *(కవిత : వృద్ధాప్యం, పుట : 34)*

అంటూ వృద్ధాప్య జీవితాన్ని గురించి ఎంతో ఆర్ధంగా చెబుతారు. ఇలా వివరిస్తూపోతే ఈ సంపుటిలో ప్రతి కవితా ఆర్ధ్రంగా తడివడిగా మన హృదయాల్ని స్పృశిస్తుంది. దాటుకొని వెళ్ళడమే కష్టం.

**కోనసీమ దృశ్యాలమోత**

**'వడ్లబండి' (1997) :**

వెంటాడే వాక్యాలతో, ఎదురుచూస్తున్న దృశ్యాలతో, గోదావరి జ్ఞాపకాలతో, పల్లెసీమల సౌందర్యంతో పరవశించిన కవిత్వమే భగ్వాన్ వడ్లబండి. ఇది 1997లో ప్రచురింపబడింది.

మొదటి కవితలోనే 'అమ్మంటే అంతేనేమో' అంటూ –

***ఇల్లూ వాకిలీ మంచమూ కంచమూ అన్నీ అరుగే ఐన/ ముసలితల్లి మీకెక్కడైనా కనిపించిందా?/ ఆమె గుండెకోత చప్పుడు మీకెప్పుడైనా వినిపించిందా?***

అంటూ ఓ కన్నతల్లి తన కన్నకొడుకు ముందు దోషిగా, దీనంగా, అనాథగా నిలబడ్డ సన్నివేశాన్ని వర్ణిస్తాడు కవి. చీలిన దారులన్నీ విధ్వంసం కూడలిలోనే ఏకమవుతున్నాయని, ఇప్పుడు మనిషంటేనే మృత్యువనీ, ఈ ఆధునిక భగవద్గీతలో చంపేవాడూ, చచ్చేవాడూ మనిషేనని ప్రకటిస్తాడు.

అంతేకాదు బ్రెజిల్‌లో అనాధ పిల్లల్ని క్రూరంగా హత్యచేయడాన్ని నిరసిస్తూ మీ దేశం సుందరమైందని, మీ కళాత్మక కొయ్యగుండెలతో సగర్వంగా ప్రకటించుకోండి అని ఆవేదనగా పల్కుతాడు. ఇవాల్టి డ్రగ్ కల్చర్‌కు యువత బానిస కారాదని, అవశేషం, ఆవిరీ కారాదని హితవు పల్కుతారు.

సూదీదారమే జీవనాధారంగా, దర్జీపనిలో వాడి గుండె మూలుగుల్ని పట్టించుకొన్న కవి. పల్లె తనకు పంచప్రాణాలు చెలికాడుగా భావించారు. దేశం వెన్నెముక విరిగిపోకూడదని ఆశిస్తారు. వరిరైతు మరో పత్తిరైతు కాకూడదని భావిస్తారు.

***"గోదావరి జ్ఞాపకం వస్తే***

***తెలుగు జనజీవన కళల కాంతులన్నీ జ్ఞాపకం వస్తాయి***

***గోదావరి అలల కదలికల్లో నాకెప్పుడూ మూడు రంగుల సరధనుస్సు కనిపిస్తుంది"*** (కవిత : గోదావరి జ్ఞాపకం వస్తే, పుట : **61**)

ఈనాడు కన్నీటితో గొంతు తడుపుకుంటోన్న కోనసీమను చూసి ఆవేదన చెందుతారు. ఇలా భగ్వాన్ 'వడ్లబండి'లో సమస్త సామాజిక జీవన దృశ్యాలను ఆవిష్కరిస్తారు.

**నీటి అద్దంలో ఏటిఒడ్డున ప్రయాణం హైకూలు (2000) :**

సున్నిత మనస్కుడైన కవి అవసరమైచోట్ల తీవ్రంగా ప్రతిస్పందించడం ఇతరుల అనుభవాల్ని తన అనుభవాలుగా అనుభూతించడం కవి భగ్వాన్ విషయంలో అంతే జరుగుతుంది. 2000 సంగులో 'ఏటి ఒడ్డున ప్రయాణం' పేరుతో హైకూలుగా రాశారు. ఇందులో అనుభవాలున్నాయి. అనుభూతులన్నాయి. ఆహ్లాదకరమైన భావపరంపరలున్నాయి. ముఖ్యంగా చిన్నపిల్లల దృష్టిలో రాసిన హైకూల్లో సరికొత్త ప్రపంచం దర్శనమిస్తుంది.

***అమ్మా/ తెల్లారగట్ల నన్ను లేపొద్దు/ ఇంచక్కని కలలొస్తాయి సెలవులైపోయాయి* (పుట : 23)**

విషాదభావనలు కూడా హైకూల్లో వొదిగించడం భగ్వాన్ ప్రత్యేకత.

***తెగిన గాలిపటాన్ని/ వెతుక్కుంటూ కుర్రాడు/ ఇంటికి ఇంకా చేరలేదు* (పుట : 31)**

ఇవి చదువుతూ వుంటే అల్పాక్షరాలతో అనల్పార్థరచన అన్నట్లుగా ఈ కవి అద్భుతమైన ఊహా, భావన మనల్ని ట్రాన్స్‌లోకి నడిపిస్తాయి.

***ఎక్కడ్నుంచో పిట్ట/ అద్భుతంగా పాడుతోంది/ ఇవాల్టికి కవిత్వం చదవక్కర్లేదు* (పుట : 20)**

***ముఖం కడుక్కుందామని/ చెరువులోంచి/ దోసెడు ఆకాశాన్ని తీసాను* (పుట: 09)**

***పిల్లలు పడుకున్నాకా/ ఆమె నవ్వింది/ గది ఓ సౌందర్య ప్రపంచం* (పుట : 5)**

***ఆమె బిందె ముంచుతోంది/ చెరువు పులకించి/ మృదంగం వాయించింది* (పుట : 4)**

ఇలాంటి అద్భుతమైన, ఆహ్లాదకరమైన దృశ్యాలు, సన్నివేశాలు భగ్వాన్‌కే ఎందుకు కన్పిస్తాయి? నాకెందుకు కన్పించవు అన్న అసూయ కూడా అప్పుడప్పుడూ 'తళుక్'మంటూ మెరిసి నవ్వుతుంది. హైకూ కవిత్వంలో భగ్వాన్‌కూ ఓ ప్రత్యేకత ఉందంటాను.

**మానవ కవితల కవితావిహారం 'బల్లకట్టు' కవిత్వం(2002)–**

భగ్వాన్ 'బల్లకట్టు' చదివినవారెవరైనా వారి కవిత్వానికి వీరాభిమానులు కావడం తథ్యం. బల్లకట్టు కవితాసంపుటి 2002లో విడుదలైంది. భగ్వాన్ కవిత్వ జీవితంలో ఈ బల్లకట్టు ఒక మైలురాయి. ఒక అణిముత్యం అని చెప్పవచ్చు. 38 కవితలతో 94 పుటలున్న ఈ కవిత్వం సమస్త మానవీయ అంశాలకు ప్రతిస్పందించింది. ప్రకృతిలో అన్ని ప్రాణులూ, వస్తువులూ, ఇందులో కవితావస్తువులే. అది పిట్టకావచ్చు, ఇల్లు కావచ్చు, చెట్టుకావచ్చు, అమ్మపాటో కావచ్చు, ప్లాస్టిక్‌కవరు కావచ్చు ఒకటేమిటి సమస్తం కవిత్వమే.

మన సౌఖ్యాలకు ఏ కంప్యూటర్ భరోసా ఇవ్వదంటారు. చెట్లే వన గొడుగులు నీకు కావల్సింది బ్యాంక్ బ్యాలెన్స్ కాదు. నాకిన్ని చెట్లున్నాయని చెప్పమంటారు కవి.

ఈ ఎలక్ట్రానిక్స్ దృశ్య తరంగ మాయాజాలంలో చిక్కి ఇంటిని పోగొట్టుకున్న మనిషీ, మనిషిని పోగొట్టుకున్న ఇల్లూ సమాజం మెడలో పుర్రెల దంతాలు కాక మరేమవుతాయని ప్రశ్నిస్తారు కవి. తల్లిదండ్రుల ప్రేమానురాగాల బలంలో పెరిగి, విద్యావంతుడై ఎదిగి గోల్డ్‌మెడల్ సాధించిన కుమారుడు కనిపెంచిన వారిని రోడ్డుమీద వదిలేస్తే వారి పుత్రోత్సాహమెలా వుంటుంది?

***మెడలో నువ్వు – రోడ్డున మేము/ ఏ నేరానికి మాకీ శిక్షో సెలవిస్తావా కొడుకా?/ కనడాన్నీ, పెంచడాన్నీ, ప్రేమించడాన్నీ/ నేరాల్ని చేసిన/ దయగల పుత్రుడా/ చాలు చాలు/ ఈ జన్మకీ శిక్షచాలు/ క్షణక్షణ మరణం/ మా నుదుట రాసిన కొడుకా/ నిన్ను శపించాలనుందిరా/ కానీ తండ్రినైపోయాను* (కవిత : పుత్రోత్సాహం, పుట : 12)**

అమ్మ చనిపోవడం ఎవరికైనా పెద్ద శిక్షేనంటారు. పత్తిని పేనితే ఉరితాడయ్యిందని నల్లరేగడి నేలే సాక్ష్యం చెబుతుంది అంటారు. పత్తి పండించే రైతులకు ఆ గుప్పెడు పత్తిగింజలే అతడి శవంమీద అక్షింతయ్యాయని పత్తి రైతులు దుఃఖాన్ని తానూ పంచుకుంటాడు కవి. నిజంగా కవిత్వంలో చెట్టు కవిగా ముద్రపడిన 'ఇస్మాయిల్' తర్వాత 'భగ్వానే' అని చెప్పుకోవచ్చు. వీరికి చెట్టంటే ఎంతప్రేమో –

***ఇంట్లో అమ్మ ఎంతో/ ఇంటి ముందు చెట్టూ అంతే/ వాస్తవంగా చెట్టుపాతుకున్నది/ మా ఇంటిముందు మట్టిలోకాదు/ మాగుండె నేలలో/ చెప్పాలంటే ఇది చెట్టుకాదు/ మా కుటుంబంలో ఒక మనిషే/ గొంతు చింపుకొని మరీ అడుగుతున్నా/ మళ్ళీ నా చెట్టు నాక్కావాలి/ నాచెట్టుమీద హక్కు అధికారమూ/ నాకే ఉండాలి* (కవిత : ఇంటిముందు వేపచెట్టు, పుట : 30)**

ఈ కవికి పిట్టమీద ఎంతటి మమకారమో, మొత్తం ఇంద్రధనువుని గుప్పెడు ముద్దగా చేస్తే అది పిట్టేనేమోనంటారు. పిట్ట లేని ప్రకృతిని ఊహించలేరు.

రైతుకు ద్రోహం చేస్తున్న టెర్మినేటర్ టెక్నాలజీని తీవ్రంగా నిరసిస్తారు. బహుళజాతి కంపెనీల మోసాన్ని బట్టబయలు చేస్తారు. దేశానికి తల్లి వేరు పల్లేనని పల్లెల్ని రక్షించుకోవాలని పిలుపునిస్తారు. అంతేకాదు. వానచినుకులు సోయగాన్ని అద్భుతంగా కవిత్వీకరిస్తారు. తెగులుపడి మీసకట్టు గోదావరేనంటారు. అసలు నన్ను కవిని చేసింది గోదావరేనని సగర్వంగా చెబుతారు కవి.

***గోదావరేనమ్మా ఎక్కడుందీ అంటే/ తన తలపాపిడి చూపించింది మా అమ్మాయి/ రేవురేవునీ కడుగుతూపోయే గోదావరి/ అప్పుడే పుట్టిన పసికందుల్ని కడుగుతున్న/ ఆసుపత్రి నర్స్‌లా ఉంటుంది/ పరుగెత్తీ పరుగెత్తీ గోదావరి కలిసేది/ సముద్రంలోకాదు నాలో....*** *(కవిత : నాలో గోదావరి, పుట : **44**)*

ఎటువంటి వస్తువైనా భగ్వాన్ చేతిలో అద్భుతమైన కవిత్వంగా రూపొందుతుందన్న మాటకు సాక్ష్యమే 'ప్లాస్టిక్ కవరు' ప్లాస్టిక్ పదార్థాన్ని విధ్వంసకర్బనంగా వారు అభివర్ణించిన తీరు ప్రశంసనీయం.

'ఆఫ్టాల్ ప్లాస్టిక్' అనుకుంటే పొరపాటనీ, అంత ఆఫ్టాల్‌గా భూగోళాన్నే చప్పరించేస్తుందనీ, ప్లాస్టిక్ వస్తువులతో చెలిమి విషపూరితమనీ, చెట్లు నేలకుబరువై భూగర్భజలాలు కరువై మనిషికి వలసపోయేచోట కన్పించదనీ, అసలు ప్లాస్టిక్ వాడకం పెరిగిందంటే మనిషి ఆయుస్సు తరిగిందని అర్థం చెప్పాడు కవి.

***విరిగిన/ వాడీవాడీ వన్నెతగ్గిన/ వ్యర్థ ప్లాస్టిక్‌ను కాల్చేస్తేనో/ పొగలోంచి లేచిన కార్బన్ రాక్షసుడు/ ప్రకృతిని పలావులా తింటాడు/ పొగసోకిన తల్లి గర్భంలోంచి పిల్లలు/ బట్ట తలలతో పుడతారు/ పొగచూరిన నేలకు నపుంసకత్వం వస్తుంది/ మనిషి చేతిలో వేలాడుతున్న ప్లాస్టిక్ సంచీ/ శవదహనానికి తీసుకుపోతున్న/ నిప్పుల కుండని గుర్తుకుతెస్తుంది/ ప్లాస్టిక్‌ను వాడీవాడీ వాడి గుండె/ ఓ ప్లాస్టిక్ సంచీగా మిగిలిపోతుందేమోననే నా భయం*** *(కవిత : విధ్వంస కర్బనం, పుట : **50**)*

నెమలిని చంపడమంటే అడవి తల్లి నుదుటి బొట్టు తుడిచెయ్యడమేనని, నెమలి బొమ్మేనాకు చదువు అనీ, నెమలంటే నాకు అమ్మంత ఇష్టమనీ వివరిస్తారు. పుస్తకమంటే మంచి నీటిబావి అనీ, ఒక వీరుడు మెలమెల్లగా తనలోకి ప్రవేశించడమేనంటారు. ఊటీలో ఓ ఆహ్లాద సాయంత్రాన్ని గుర్తుచేసుకుంటారు సముద్రం ఒడ్డున సూర్యోదయ దృశ్యాన్ని నెమరేసుకుంటారు. పర్యావరణంలో సమతుల్యం లోపించి సీతాకోకచిలుకలు మరణిస్తున్నాయని ఆవేదన చెందుతారు. ఒక అంధురాలి పాట కచేరీని మెచ్చుకుంటారు. ఒక చేనేతకారుని జీవనపోరాట వ్యధను అద్భుతంగా చిత్రించిన కవితే – విరిగిన మగ్గం. ఈ కవిత చదువుతుంటే నా స్వీయ అనుభవం, జీవనపోరాటం గుర్తొచ్చి చలించిపోయాను. ఈ కవిత ఇచ్చిన స్ఫూర్తే నేను 2006లో 'మగ్గంబతుకు' దీర్ఘకావ్యం రాయగలిగానేమో అన్పించింది నాకు.

నా 'మగ్గం బతుకు' దీర్ఘకావ్యాన్ని రాయడానికి పరోక్షంగా భగ్వాన్ నాకు స్ఫూర్తిగా నిలిచారంటే అతిశయోక్తికాదు.

నా కావ్యం

***"ఇది యదార్థ కథ/ చేనేత చిత్రపటంలో/ విరిగిన మగ్గం వ్యథ"*** అంటూ

ప్రారంభమై నేతగాడి అప్పులు, వలసలు, పాలకపక్షాల నిర్లక్ష్యంతో వృత్తిని బతికించుకోలేని స్థితిలో 'ఆకలిచావులు' గురించి నా దీర్ఘకావ్యమంతా నడుస్తుంది. భగ్వాన్ కూడా విరిగిన మగ్గంపేరుతో చేనేతల హృదయవిదారక జీవన దృశ్యాలను మన కళ్ళముందుంచారు.

***మగ్గం ఆడే చప్పుడు/ రోజూ రెండుపూటలా అన్నం ఉడుకుతున్న/ చప్పుడులా ఉండేది/ అది ఖాళీకంచాల చప్పుడని తెలిసొచ్చింది/ ఉరికొయ్యో,/ పురుగుమందో/ ప్రపంచీకరణ మహమ్మారి ఊపిరాడని బలవంతపు కౌగిలిలో/ ఏదైతేనేం/ వాడు గిలగిలా కొట్టుకొని చనిపోయాడు/ వాడు నేసిన తెల్లని వస్త్రం/ వాడి శవంమీదే కప్పడం పెను విషాదం/ ఇప్పుడు నాకు బట్టలు కట్టుకున్న ప్రతి మనిషీ/ వాడి శవాన్నీ మోస్తున్న ఉరికొయ్యలా కనిపిస్తున్నారు*** *(కవిత : విరిగిన మగ్గం, పుట : **90**)*

బల్లకట్టులో చివరి కవితగా – సమాజంలో గురుశిష్యుల సంబంధాన్ని పూర్వవిద్యార్థుల అభిమానం ముందు ఓడిపోయిన

గురువుగా నా టీచర్ వృత్తి ధన్యమైందని పులకించిపోతారు కవి.

ఇలా భగ్వాన్ బల్లకట్టు కవితాసంపుటి సమస్తం ప్రతి వస్తువును శిల్పసాంద్రంగా, ఎంతో ఆర్ద్రతతో అభివ్యక్తం చేశారు. కవిత్వానికి ఒక ఉదాత్తస్థాయిని కల్పించారు వారు.

**సౌందర్య సౌకుమార్య కవిత్వం – చంద్రవర్షం (2016)**

సరళతలో గాఢత, అనుభూతుల్లో సౌకుమార్యం భగ్వాన్ కవిత్వం, సమకాలీన కవుల్లో అరుదైన వ్యక్తీకరణ వీరిది. కొన్ని మెరుపులు, మరికొన్ని ఉరుములు, ఎన్నో చినుకులై చంద్రవర్షాన్ని 2016లో కవితావర్షంగా మనముందు నిలిపారు భగ్వాన్.

కవితలు మనిషితనం వాసనతో పరిమళించాలని ఆశిస్తారు. నదీ వంతెన సంభాషణలు రహస్యంగా వినగల్గినవారు భగ్వాన్ ఒక కరెంటు పోయిన రాత్రి చంద్రుడికి సైగచేసి వెన్నెల స్పర్శతో వెలిగిపోయిన జ్ఞాపకాల్ని నెమరేసుకున్నారు.

ఇంటిముందు చెట్టుపైనా, ఇంటి ప్రహరీ గోడమీదా, పెరటిలో దండెంతీగపైనా, తన ఇంటివాకిలి ముగ్గుల మీదా ఎగురుతూ రెక్కలాడిస్తూ, గంతులేస్తూ పాటపాడే 'పిట్ట'ను చూసి అమృతాన్ని కొసరి కొసరి పంచిన అవతార మోహినివి నువ్వేనా అంటూ తెగ మురిసిపోయారు.

మాస్టారికీ, విద్యార్థికీ ఉన్న అనుబంధాన్ని 'కుర్చీ'తో పోల్చుకున్నారు. గురుశిష్యుల అన్యోన్య అనుబంధాన్ని ఈ కవితలో అద్భుతంగా పలికించారు కవి. 'మాస్టారులేని కుర్చీని' కవితావస్తువుగా చేసుకున్నారు.

***ఇప్పుడు మా మాస్టారు లేరు/ ఆయన కూర్చున్న కుర్చీ వుంది/ రంగు చెదిరినా, పేడులూడినా అక్కడే అలాగే/ పరిమళాలు వెదజల్లుతూ.../ ఉత్సవాల్లో దేవుణ్ణి మోసే పల్లకీకీ/ తరగతి గదిలో మా మాస్టార్ని మోసిన కుర్చీకి/ నా దృష్టిలో అస్సలు తేడా లేదు/ కృతజ్ఞతాశ్రువులతో నేను కుర్చీని తడుముతుంటే/ మా మేస్టారు పాదాల్ని తాకుతున్నట్టే ఉంది/ కుర్చీలో మా మేస్టారు కూర్చునట్టే ఉంది/ చిరునవ్వుతో నన్ను దీవిస్తున్నట్టే వుంది*** ***(కవిత : కుర్చీ, పుట : 25)***

'ఎండ' అంటే దయ్యరు పిస్తోలూ, బుస్సీ తుపాకీ, రూథర్‌ఫర్డ్ ఫిరంగి, అంటూ ఇవన్నీ ఈ ఎండముందు బలాదూరేనంటారు. దొరికిన పాతపుస్తకమే తర్వాతి రోజుల్లో తన్ను మనిషిని చేసినట్లు చెప్పుకున్నారు. తన దార్లో జామచెట్టుమీద వాలిన చిలకల సందడిని మనకు విన్పించారు. బస్సు ప్రయాణంలో కిటికీ పక్కన కూర్చొని జ్ఞాపకాల్లో గమ్యం చేరుకున్నారు. అమ్మ ఫోటోలేని ఆల్బమ్, ఆల్బమ్ కాదంటారు. తన ఇంటి అరుగుమీద పడుకున్న ఓ వృద్ధురాల్నీ, ఓ పిచ్చివాణ్నీ చూశారు. కొంతకాలం తర్వాత వారెటో వెళ్ళిపోయారు. కుక్క మాత్రం అక్కడే అలాగే వుందంటారు.

అమ్మ భాష బిడ్డలకు తెలుస్తుంది. చినుకు భాష విత్తుకి తెలుస్తుంది. మరి నది భాష పడవలకు తెల్సివుంటుందని భావిస్తారు.

కవిత్వం గురించి, కవిత్వం పుట్టక గురించి, కవిత్వ సౌందర్యం గురించి అనేక మంది అనేకంగా నిర్వచించారు. కవి భగ్వాన్ నిర్వచనం ఇలా ఉంది.

***రాత్రి పదకొండు గంటలు/ వానలో వెన్నెల తడుస్తున్నట్లు/ నేను కవిత్వంలో తడిసి పోతున్నాను/ ఈ రాత్రి ఇక నాకు నిద్రపట్టనే పట్టదు/ పొద్దున్నే/ వెచ్చవెచ్చని వెలుతురు కణాలతో/ ఆకాశంలో సూర్యుడు ఉదయిస్తున్నట్లు/ నా గదిలో కవితోదయం జరుగుతోంది*** **(కవిత : రాత్రికి మరోపేరు కవిత్వం, పుట : 68)**

తన భాషను మరచిన వాళ్ళకు మాటా, పాటా, ఆటా అన్నీ పరాయివేనంటారు. తాతలనాటి తోటను అమ్మేసుకొని, పల్లెను కోల్పోయానని దిగులుచెందారు.

***తోట నమ్మేసుకున్నాను/ తాతలనాటి/ తియ్యని జ్ఞాపకాల్ని అమ్మేసుకున్నాను/ నా బాల్యాన్ని అమ్మేసుకున్నాను/ తోట కోసమైనా/ అప్పుడప్పుడూ పల్లెకొచ్చేవాడ్ని/ ఇప్పుడెవరి కోసం రాను?/ తోట నమ్మిన డబ్బుతో మా పిల్లల కోసం/ ఒక ఇల్లు కొనగలనేమోగానీ/ కొంతైనా పల్లె నివ్వగలనా?..*** ***(కవిత : తోటకు వీడ్కోలు, పుట : 103)***

ఇలా భగ్వాన్ కవిత్వ వ్యామోహంలో పడిపోతే పైకి తేలడం కష్టమే ముఖ్యంగా భగ్వాన్ అంటే 'బల్లకట్టు' గుర్తువస్తుంది. ఎవరికైనా, ఇందులో కవి స్పృశించని వస్తువులేదు. అభివ్యక్తిలో ఆర్ద్రత, తడితడిగా అంటుకుంటుంది. మనిషితనాన్ని మంచితనాన్ని, మానవీయతను గురించి భగ్వానే చెప్పాలి. వర్తమానకవుల్లో భగ్వాన్ కవితాముత్యం. తనదైన అనుభూతి, భావుకత, భగ్వాన్ ప్రత్యేకత. పల్లెను తల్లి వేరుగా జ్ఞాపకం చేసుకునే కవి. ప్రకృతితో మమేకమైనకవి పర్యావరణాన్ని పిచ్చిగా ప్రేమించే కవి చెట్టును, పుట్టను, పిట్టను ప్రాణాధారంగా ప్రేమించేకవి.

సహజత్వానికీ, వాస్తవికతకూ చేరువైన కవిత్వం భగ్వాన్‌ది.

ఇలా అరుదైన, అపురూపమైన కవి భగ్వాన్ అంటే అతిశయోక్తి కాదు.

# అక్షరాన్ని సంధిస్తే...

- మార్ని జానకిరామ్‌చౌదరి
9440338303




కసాయి మేఘాలు కపోత రెక్కల్ని
నిర్దాక్షిణ్యంగా నరుకుతున్న వేళ
రక్తం రుచిమరిగిన తూటా
అక్షరాన్ని ఛిద్రం చేస్తుంటే
దేహం చిమ్మిన నెత్తుటిబొట్లు
అక్షర విత్తులై
లక్ష పిడికిళ్ళుగా మొలకెత్తాయి
కాగితంపై జారిన అశ్రుకణంతో
అక్షరాన్ని సంధిస్తే
మోడుకు మొలిచిన చిగుళ్ళను కూడా
ఎరుపెక్కిస్తుంది
నీ పాదం కింద పిడిబాకై మెరుస్తుంది
గాంధీజీ బలిదానానికో
'గౌరీ లంకేశ్' పై తూటా దాహానికో
సత్యాన్వేషణ ఆగుతుందా?
అక్షరంపై దండెత్తినంత మాత్రాన
సత్యశోధన మరుగున పడుతుందా?

అక్షరమే కదాని తొక్కిపారేయకు
మంత్రించి వదిలిన గడ్డిపరకలా
బ్రహ్మాస్త్రమై దహిస్తుంది
నిప్పుల కొలిమిలో కాలుతున్న
పేగుకణం
నెత్తుటి స్వప్నాన్ని శ్వాసిస్తుంది

భావప్రకటనా స్వేచ్ఛను
హరిస్తుంటే
నీ పాదం కింద నలిగిన అక్షరమే
అణువులుగా విస్ఫోటించి
నీ అస్తిత్వాన్ని బద్దలు చేస్తుంది

నా దేశపు మట్టిసాక్షిగా...
అక్షరాన్ని ఆయుధంగా చేసుకుని
స్వేచ్ఛావాయువు కోసం
నిరంతర పోరాటం చేస్తూ
కూలుతున్న 'గౌరీ' శిఖరాలను
అక్షర పునాదులపై
పునర్నిర్మాణం చేస్తాను
నీ దందాకు మంగళం పలుకుతాను

*(గౌరీ లంకేశ్ హత్యకు నిరసనగా)*

◆

# నిర్భయంగా ఉద్యమించడం అవసరం




- నందనారెడ్డి

సెప్టెంబరు 5 సాయంత్రం బెంగుళూరులో జరిగిన హత్య గౌరీ లంకేశ్ విధినిర్వహణలో కాంగ్రెస్ ప్రభుత్వ అసమర్థతను, బీజేపీ రాజకీయ ప్రణాళికలను ప్రస్ఫుటం చేసింది. 2015లో ధార్వాడ్లో జరిగిన కల్బుర్గీ హత్యకు, సెప్టెంబరులో బెంగళూరులో జరిగిన గౌరీ హత్యకు సంబంధం ఉన్నట్టు బెంగుళూరు పోలీసులు అనుమానిస్తున్నారు. హతులిద్దరూ దామపక్ష రాజకీయాలను విమర్శిస్తున్నవారే! ఇద్దరినీ వారి నివాసాలలోనే గుర్తు తెలియని వ్యక్తులు మోటారు సైకిళ్ళమీద వచ్చి, దగ్గరగా కాల్పులు జరిపిహత్య చేశారు. 2015లో కొల్హాపూర్లో జరిగిన గోవిందపన్సారె హత్యకు, 2013లో పూణేలో జరిగిన నరేంద్రదభోల్కర్ హత్యకు గూడా సామ్యం ఉన్నట్టు గుర్తించారు. పన్సారె, కల్బుర్గీ హత్యలకు ఉపయోగించిన తుపాకీ గూడా ఒకటేనని నిర్ధారించారు. తరువాత ఆ తుపాకీ పోలీసులకు దొరికింది. పన్సారె హత్యకు ఉపయోగించిన రెండవ తుపాకి దభోల్కర్, కల్బుర్గీ, గౌరీ హత్యలకు గూడా ఉపయోగించినట్టు తెలుస్తున్నది. అంటే ఈ నాలుగు హత్యలకు సంబంధం ఉన్న విషయం స్పష్టమవుతున్నది.

"సనాతనసంస్థ" పేరుతో ఒక హిందూ తీవ్రవాద సంస్థను ఒక అనధికారనిధి స్థాపించింది. దభోల్కర్, పన్సారే హత్యలతో సంబంధం ఉన్నవారికి ఆ సంస్థతో సంబంధం ఉన్నట్టు అనుమానించి అరెస్టు చేశారు. కాని వారిని ప్రశ్నించిన తరువాత తెలిసిన సాక్ష్యం తగినంత బలంగా లేదని వారిని విడిచిపెట్టారు. 2009లో గోవాలో జరిగిన బాంబు ప్రేలుళ్ళకు గూడా వీరిపైనే అనుమానం. కల్బుర్గీ హత్య విషయంలో పోలీసులు ఇంకా స్పష్టమైన నిర?యానికి రాలేదు. సరైన సాక్ష్యం దొరకలేదని చెపుతూనే నిందితులు పలుకుబడి కలవారని చెపుతున్నారు. సనాతన సంస్థ ప్రతినిధి చేత న్రాజన్ గౌరీ హత్యతో తమకు సంబంధంలేదని చెపుతూనే తమ సంస్థలోని హిందువులు హత్యకు గురైనప్పుడు ఎవరూ ఖండించలేదని, గౌరీ కారణంగా బాధపడిన వారికి ఎవరూ సానుభూతి చూపించలేదని వాపోయాడు. (అంటే గౌరీ కారణంగా కొందరు బాధపడ్డారని సూచిస్తున్నాడు. వారెవరు?)

ఈ హత్యలు బీజేపీ అధికారంలో లేని రాష్ట్రాలలో జరిగిన కారణంగా ఆ రాష్ట్రాలను గూడా తమ పార్టీకి అనుగుణంగా మార్చుకోవాలన్న ప్రయత్నం జరుగుతున్నట్టు అనుమానించాల్సి

వస్తున్నది. మంగుళూరులో జరిగిన హిందూ కార్యకర్తల హత్యలకు నిరసనగా భారతీయ జనతాపార్టీవారు, యువమోర్చావారు కలిసి బెంగుళూరు నుంచి సైకిల్ ర్యాలీ నిర్వహించాలని ప్రయత్నించారు. అందుకోసం వేలాది పార్టీకార్యకర్తలు గౌరీ హత్య జరిగిన రోజు ఉదయం ఫ్రీడం పార్కులో సమావేశమయ్యారు. ఆ ఊరేగింపు అశాంతికి కారణమవుతుందన్న భయంతో పోలీసులు అనుమతి నిరాకరించారు. కొంత అల్లరి జరిగినా పోలీసులు ఆ ఊరేగింపుని ఆపగలిగారు. ఆ సాయంత్రమే గం.7.45 నిమిషాలకు గౌరీ హత్యజరిగింది. అందుకు వెంటనే ప్రజల నుంచి తీవ్రస్పందన కనిపించింది. "నిన్న కలుర్గీకి నేడు గౌరీ, రేపెవరు?" అన్న నినాదాలతో ఆప్రాంతం ప్రతిధ్వనించింది. "కల్బుర్గీకి న్యాయం జరగాలని రెండేళ్ళు నిరీక్షించినా ఫలితం శూన్యమే. కాని గౌరీ విషయంలో అలా జరగటానికి వీలులేదు" అని ఆందోళన మొదలైంది.

గౌరీ సోదరుడు ఇంద్రజిత్ ఒక టీవీ చానెల్‌కు ఫోన్ ద్వారా జరిపిన సమావేశంలో సీబీఐ ద్వారా విచారణ జరగాలని కోరాడు. అంటే రాష్ట్ర ప్రభుత్వం జరిపే విచారణ మీద నమ్మకం లేదని సూచించాడు. గౌరీకి రక్షణ కావాలని తాను కోరినా రాష్ట్ర ప్రభుత్వం స్పందించలేదని ఆరోపించాడు. ఇంద్రజిత్ భారతీయ జనతాపార్టీ అనుయాయి. నరేంద్రమోదీకి, యడ్యూరప్పకు భక్తుడు. గౌరీ హత్యకు నక్సలైట్లు బాధ్యులని కొత్త నినాదం లేవదీశాడు. కాని గౌరీ సోదరి కవిత ఆ నినాదాన్ని ఖండించింది. మామూలుగానే సాంఘిక మాధ్యమంలో రకరకాల చర్చలు ప్రారంభమయ్యాయి. గౌరీ నక్సలైటని, ప్రభుత్వానికి వ్యతిరేకి అనీ, హిందూ మతద్వేషి అనీ రకరకాలుగా వ్యాఖ్యానాలు వచ్చాయి. ఎవరికి తోచినట్టు వారు ప్రచారం చేశారు. చివరికి ఆమె విపరీత భావాల కారణంగానే ఆమె మీద దాడి జరిగిందని తీర్మానించారు. (అంటే ఆహత్యకు ఆమే కారణం గాని ఇతరు లెవరూ కాదని సూచించారు.) ట్విట్టర్మాధ్యమంలో మోధ అనుయాయులు కొందరు తమకు వ్యతిరేకులైన వారి జాబితా తయారుచేస్తున్నారు.

గౌరీ హత్య జరిగిన తరువాత ఆమె పేరుని లిస్టు నుంచి తొలిగించి "ఇక తరువాత అరుంధతీరారు వంతు" అని ప్రకటించారు.

గౌరీ తండ్రి పి.లంకేశ్ 1980లో సాహిత్య అకాడెమీ పురస్కార గ్రహీత. విమర్శనాత్మకమైన వారపత్రిక "లంకేశ్ పత్రిక" స్థాపించిచాడు. గాంధీ నిర్వహించిన "హరిజన్" పత్రిక స్థాయిలో దానిని నిర్వహించాడు. సామాన్యంగా పత్రికలు ప్రకటనల ద్వారా వచ్చే ఆర్థిక సహాయంతోనే నడుస్తుంటాయి.. ఒక్కొక్కసారి వారి అవసరాలకనుగుణంగా రాయవలసి వస్తుంది. అది లంకేశ్‌కి ఇష్టంలేదు. అందువలన ప్రకటనలు తీసుకోకుండా పత్రికను నడిపించాడు. అందుకు ఎంతో కష్టపడవలసి వచ్చింది. కేవలం పాఠకుల చందాలతోనే నిర్వహించాడు. దళితులకు, స్త్రీలకు, బడుగు వర్గాలకు అండగా నిలిచిన పత్రిక అది. చురుకైన విమర్శలతో అప్పటి రైతు ఉద్యమాలకు, బడుగు వర్గాల ఆందోళనలకు ప్రోత్సాహమిచ్చిన పత్రిక అది. పాఠశాలల్లో సంస్కృతం ప్రథమ భాషగా ప్రవేశపెట్టాలని ప్రతిపాదన వచ్చినప్పుడు అందుకు వ్యతిరేకంగా ఉద్యమం నడిపాడు. తరువాత సమతాభావాలతో ఆనాటి సోషలిష్టులు యు.ఆర్.అనంతమూర్తి, గోపాల గౌడ, యస్. వెంకటరాం, వై.యం. క ష?మూర్తి, కావేరి శామణలకు సన్నిహితుడయ్యాడు. మాకు కుటుంబ మిత్రుడయ్యాడు. 1970లో లంకేశ్ రచించిన నాటకం "విప్లవం వస్తున్నది"లో హింసను రాజకీయ అస్త్రంగా వాడుకోగూడదని సూచించాడు. అది మా తండ్రి పఠాభిరామిరెడ్డి ఆకర్షించింది. ఆ నాటకం ఆధారంగా "చండమారుతం" అన్న చిత్రాన్ని నిర్మించారు. ఆ చిత్రనిర్మాణం ముగిసిన రోజునే ఇందిరా గాంధి అత్యవసరపరిస్థితిని ప్రకటించింది. ఆవెంటనే మా తల్లిగారైన స్నేహలతారెడ్డిని అరెష్టు చేశారు. ఆచిత్రంలో ఆమె ముఖ్యపాత్ర పోషించింది. నేను గూడా నటించాను. ఆ చిత్ర నిర్మాణంలో పాలుపంచుకున్నవారు చాలామంది ఎమర్జెన్సీకి వ్యతిరేకంగా పోరాడారు.

లంకేశ్ ఆలోచనాపరుడు. ఇతరుల భావాలతో పాటు తన భావాలను గూడా ప్రశ్నించుకుని పరీక్షించుకునేవాడు . అందుకు మా తండ్రి ఎంతో సంతోషించేవారు. వారిద్దరికీ సత్యాన్వేషణ ఒక వ్యసనం. వారి స్నేహానికి అదే పునాది. లంకేశ్ మనసులోని భావాలను స్పష్టంగా చెప్పేవాడు. ఇతరులతో నిష్కర్షగా మాట్లాడేవాడు. వామపక్ష భావాలను, వ్యక్తిత్వాన్ని తండ్రి నుంచి పుణికిపుచ్చుకున్నది గౌరీ. 2000లో తండ్రి మరణం తరువాత పత్రిక ఇంద్రజిత్ అధ్వర్యంలో

నడిచింది. కాని 2005లో అన్నాచెల్లెళ్ళ మధ్య అభిప్రాయభేదాలు తలెత్తాయి.. గౌరీ వామపక్షభావాలను నక్సలైట్ భావాలుగా ఇంద్రజిత్ నిరసించాడు. పోలీసులకు ఫిర్యాదు చేసే దాకా వెళ్ళాడు. పత్రిక ఆఫీసుని మూసివెయ్యాలని పోలీసులకు సూచించాడు. చివరికి గౌరీనే తుపాకి చూపించి బెదిరించే స్థితికి దిగజారాడు. ఆ కారణంగా గౌరీ విడిపోయి "గౌరీలంకేశ్ పత్రిక" అన్నపేరుతో ఆ పత్రికను పునఃప్రారంభించి నడుపుతున్నది. తండ్రి వారసత్వాన్ని కాపాడింది. వీరశైవమతంలో ఒక భాగంగా ఉన్న లింగాయతులు తమను ప్రత్యేక మతంగా గుర్తించాలని ఉద్యమించినప్పుడు గౌరి ఆ ఉద్యమాన్ని సమర్థించింది. ఆ కారణంగా వీరశైవులు ఆమెకు వ్యతిరేకంగా శత్రువులయ్యారు.

కర్నాటక రాష్ట్రంలో లింగాయతులు ఒక బలమైనవర్గం. తమను వేరుమతంగా గుర్తించాలని వారు 8 దశాబ్దాలుగా కోరుతున్నారు. రాజ్యాంగ రచన సమయంలో కూడా వారి ఆందోళన ఉన్నది. ప్రస్తుతం వారి ఓట్లను చీల్చే ప్రయత్నంలో కావచ్చు, ముఖ్యమంత్రి వారి కోరికను గుర్తించి ప్రోత్సహిస్తున్నాడు. కాని అది బీజేపీకి ఇష్టం లేదు.

మానవహక్కులకోసం గౌరీ నిరంతరంగా పోరాడుతుంది. కాంగ్రెస్‌తో పాటు బీజేపీని కూడా ఘాటుగా విమర్శిస్తుంది. మావోయిస్టు ఉద్యమకారులకు తీవ్రత తగ్గించాలని సలహా ఇస్తుంది. ప్రభుత్వానికి లొంగిపోవటానికి ఇష్టపడిన మావోయిస్టుల నేరాలను క్షమించాలని ప్రభుత్వాన్ని కోరుతుంది. దళితులను నిర్లక్ష్యం చెయ్యటాన్ని ఆమె తీవ్రంగా నిరసించింది. పాకీపని వారు ఎక్కువగా చనిపోతున్నప్పుడు తీవ్రంగా స్పందించింది. "తాము చేస్తున్న పని కారణంగా ఏ వత్తిలోనైనా ఇంతమంది చనిపోతే ఎంతో గగ్గోలు పెట్టేవారు. కాని పాకీపని వారంతా నిరుపేదలు, అస్పృశ్యులు కావటం వలన వారెంత మంది చనిపోయినా ఎవరికీ పట్టదు. మనమంతా వారిపట్ల చూపుతున్న నిర్లిప్తత క్షమించరానిది." అని రాసింది.

"మన రాజ్యాంగం మతాన్ని, ప్రభుత్వాన్ని వేరు చేసింది. కాని ప్రభుత్వ కార్యకలాపాలలో మతం ప్రముఖ పాత్ర పోషిస్తున్నది. చట్టసభల ప్రారంభానికి, కట్టడాలకు పునాది వెయ్యటానికి శుభసమయాలు వెదకటంలో అర్థమేమిటి? ఓడలకు కొబ్బరికాయలు కొట్టటమేమిటి? వర్షాల కోసం ప్రార్థన లేమిటి?" అని ప్రశ్నించింది. హిందూ జాతీయవాదులు ఆనాడు బ్రిటిషువారికి అండగా నిలిచారని, స్వాతంత్ర్యసమరంలో సహకరించలేదని చారిత్రకంగా చూపించింది. జాతీయత పేరుతో సంఘ పరివార్ ప్రచారంలోకి రావటాన్ని నిరసించింది. "ద్రోహులకు దేశభక్తి ఒక ముసుగు" అని ఈసడించింది. గౌరీ అంత్యక్రియల సందర్భంలో వేలమంది అభిమానులు జమయ్యారు. కొందరైతే "నేనే గౌరీ" అనే అట్టలతో ప్రదర్శనలు చేశారు.

తమ దుష్టచర్యలకు వ్యతిరేకంగా ప్రతిహింసను రెచ్చగొట్టి లబ్ధిపొందాలన్న వారి ప్రయత్నం ఫలిస్తున్నట్టు కనపడుతున్నది. సంఘీభావం సన్నగిల్లుతున్నది. అశాంతి పెరుగుతున్నది. కోరుకున్న విలువలకు నిర్వచనాలు, అర్థాలు తారుమారవుతున్నాయి. కొత్త అర్థాలు ప్రచారమవుతున్నాయి. సాంఘిక వ్యవస్థలు పౌరులను అణచివెయ్యటానికి సాధనాలుగా ఉపయోగపడుతున్నాయి. కర్నాటక రాజకీయాలు కులము, మతము, భాషల చుట్టూ తిరుగుతున్నాయి.. రాష్ట్ర ప్రభుత్వం తమ పార్టీకి నిధులు సమకూర్చే దిశలోనే పని చేస్తున్నది. ప్రాంతీయ సమస్యలు జాతీయ అవసరాలకు లొంగిపోతున్నాయి.. రాజ్యాంగాన్ని విస్మరించి చేస్తున్న ఈ ప్రయత్నం తమపార్టీకే ముప్పు తెస్తుందన్న విషయాన్ని వారు గ్రహించటం లేదు.

వ్యక్తిగత గోప్యత ఒక ప్రాథమికహక్కుగా సుప్రీంకోర్టు ప్రకటించినందుకు సంతోషిస్తున్న సమయంలో గౌరీ హత్యలాంటి అమానుష సంఘటనలు నిజంగా దురదృష్టం. మన రాజ్యాంగానికి మనం ఎంత దూరంగా ఉన్నామో తెలియజేస్తున్నది. గౌరీ హత్య భావస్వాతంత్ర్యాన్ని, క్రియాశీలతను హత్యచేసింది. ఇప్పుడు మనకర్తవ్యమేమిటి? స్వార్థపూరితమైన రాష్ట్ర ప్రభుత్వాన్ని సహించటమా? ఉక్కు పిడికిలి వంటి అధికారానికి లొంగిపోవటమేనా? ఎన్నుకున్న ప్రభుత్వాన్ని జవాబుదారీ చెయ్యలేమా? రాజ్యాంగమిచ్చిన ప్రజాస్వామ్యహక్కులను కాపాడుకోలేమా?

నిర్లిప్తత విడిచి క్రియాశీలురమై కదలాలి. గౌరీ హత్య మొదటిది కాకపోయినా చివరిది కావటానికి గౌరీ లాగానే నిర్భయంగా ఎదిరించి నిలవాలి. ఆమె మరణంతో శాంతియుత విప్లవానికి నడుం బిగించవలసిన సమయం ఆసన్నమైంది. దేశంలో ప్రజాస్వామ్య రక్షణకోసం ఆమె తనజీవితాన్ని అంకితం చేసింది. ఇప్పుడిక మనబాధ్యత మాత్రమే మిగిలింది.

# ఎవరో... ఏ ఊరో...

- కావేరిపాకం రవిశేఖర్
9849388182



అప్పుడు

సమయం సాయంత్రం ఆరో.... అరున్నరో అయింది. రోడ్డు సైకిళ్ళు, ఆటోలు, కార్లతో ఒకటే హడావుడిగా వుంది. అప్పటిదాకా మేసిన పిట్టలన్నీ గూళ్ళకు మళ్లాయి. సూర్యుడ్ని పడమటి దిక్కు నెమ్మదిగా మింగుతోంది. చీకట్లు నెమ్మదిగా నలుపు రంగు చల్లుకుంటూ వస్తున్నాయి. ఎటు చూసినా నల్లని చీకటి కాటుక బాగా కరిగించి ఆ నీళ్లు దిమ్మరించినట్లుంది. అది ఆ నగరాన్ని నెమ్మదిగా తన కౌగిట్లోకి లాక్కుంటోంది.

ఆ రోడ్డు ఎప్పుడూ విపరీతమైన రద్దీగా వుంటుంది. ఓ పక్క ఎప్పుడూ జనంతో రద్దీగా వుండే సూపర్ మార్కెట్, దాని కెదురుగా సాయిబాబా గుడి, దాని ముందు పెద్ద రావిచెట్టు. దానికి కాస్త దూరంగా ఓ సినిమాహాలు, మరికాస్త ముందుకెళ్తే రాములోరి గుడి. జనం.... జనం..... ఒకటే జనం ఎటు చూసినా జనం.

సమయం 9.00 గంటలు కావస్తోంది. సాయిబాబా గుడిలో ఇంచుమించుగా ఆఖరి హారతి పూర్తి కావొస్తుంది. ట్యూషన్లు వదిలిన పిల్లలు వాడిపోయిన పువ్వుల్లా వచ్చి ప్రసాదం తీసుకు వెళ్తున్నారు. ఓ ఇద్దరు పిల్లలు మాత్రం ఎందుకనో కొట్టుకుంటున్నారు. గుడి ముందరి బిచ్చగాళ్లు ఎవరూ చూడకుండా డబ్బు లెక్కబెట్టుకుంటున్నారు.

గుడి పూజారి గుడి మూసి మిగిలిన ప్రసాదాన్ని అక్కడున్న బిచ్చగాళ్ళందరికీ పంచాడు. ఎంత ఆకలిగా వున్నారోగాని ఆ ప్రసాదాన్ని వాళ్ళు ఆబగా తిన్నారు. పూజారి స్కూటర్ స్టార్టు చేసి ఇంటికి పోబోతుండగా ఓ కుక్కపిల్ల కుయ్.... కుయ్... మంటూ తోకాడించుకుంటూ పూజారి పాదాలు నాకింది. పూజారి స్కూటర్ డిక్కిలోని ప్రసాదాన్ని దానికి కొంత పెట్టాడు. దాన్ని తిని అది తృప్తిగా వెళ్ళిపోయింది. పూజారి బయల్దేరి వెళ్ళిపోయాడు.

నగరం నెమ్మదిగా నిశ్శబ్దమనే చీరను కట్టుకుంది. చల్లగాలికి రావిచెట్టు తలవూపుతున్నట్టుంది. ఎక్కడో మెరుస్తున్న మెరుపుల వెలుగు ఆరి వెలుగుతున్న ట్యూబ్‌లైట్‌లా వుంది. సెకండ్ షో మొదలైనట్టుంది. ఆ గుడి ముందరి చెట్టు కింద పేవ్‌మెంట్‌పై కొచ్చారు. కొందరు ముసలి బిచ్చగత్తెలు. అందరూ పగలబడి నవ్వుతూ బిగ్గరగా మాట్లాడసాగారు.

వాళ్ళలో ఒకావిడేమో బొడ్లోని చిన్న సంచి తీసి ఓ పొగాకు కాడ, వక్కపలుకు నమలసాగింది. చేతిలోకి తమలపాకు తీసుకుని చీరకు తుడుచుకుని సున్నం రాసి నములుతూ, గారపట్టిన పళ్ళతో నవ్వుతూ మాట్లాడుతోంది.



గుడి మీదున్న పావురాలు గుర్... గుర్ మంటున్నాయి. ఒకామేమో ముక్కుకున్న రెండు బేసర్లతో (పెద్ద ముక్కుపుడకలు) ముక్క ఎగబీలుస్తూ, ఎర్రగా పండిన తాంబూలపు ఎంగిలిని తుపుక్కున్న వుమ్మింది. వాళ్ళలో ఒకామె మొహం కడుక్కుని విభూతి పెట్టుకుని వచ్చింది.

రాగానే వూర్లో నా మనవడెట్టున్నాడో అంటూ బాధగా చెప్పింది సరస్వతి. బాగానే వుంటాడ్లే సరసా అంది మరోకావిడ. అక్కడ ఎవరూ ఎవరికీ తెలియదు. అయినా ఏదో తెలియని ఆత్మీయత వాళ్ల మధ్యన పెనవేసుకుంది. వాళ్ళు సరస్వతి (సరసా), ఎంగట లక్ష్మి, కమిలి, శాంతమ్మ, సుశీలమ్మ.

అప్పుడు సరస్వతి చెబుతూ మావూర్లో వరసగా ఏడెండ్లు కరువొచ్చింది. బావులు, చెరువులు అన్నీ ఎండిపోయాయి. గడ్డిపోస గూడా మొలవడంలే. దాంతో జరుగుబాటు లేక కొంతమంది పట్నానికి కూలిపనులకి బోయినారు. కొందరేమో వాడే గొడ్డుగోదా ఒకటి సగానికి అమ్ముకోని బతకతా వున్నారు. రైతులు ఆకాశం చూస్తానే వుండారు. చినుకు రాలక నోళ్లు దెరుచుకున్న నేల ఆకాశం సాయి ప్రాణాలుగ్గబట్టుకొని జూస్తావుండాది.

ఎవురో పక్క కయ్యిలోళ్లకి పవర్ బోర్ యేస్తే నీళ్లుబడ్డాయని నా కొడుగ్గూడా అప్పుదెచ్చి బోరెయిపిచ్చినాడు. వందలడుగులు బోయినాగాని నీళ్ళు బడ్లే. రెండు లక్షలు దాకా అప్పైపోయినాడు. రోజురోజుకి వడ్డీలు బెరిపోయినాయ్. బిత్తరపోయి వాడేమో మందూ (పురుగుమందు) దాగేసినాడు. నా కోడల్ని, మనవడ్ని, ఆడ్నే బేట్టినా లేకపోతే అప్పులోళ్ళు ఒప్పుకుంటారా? అని దీర్ఘంగా నిట్టూర్పా విడిచింది. ఇంతకి మీదే వూరూ అని మరొకామె అడిగితే ఊరి పేరు చెప్పలా.... అభిమానం అడ్డంబడ్డాది.

ఆ తర్వాత కమిలి (కమ్మలమ్మ అయితే) చెప్తోంది. నాకు ఒక్కగానొక్క కూతురు. మా ఆయన్ని లారీ గుద్దేసి సచ్చిపోయినాడు. మాకుండేది 4 కుంటల కయ్యి. దాంతోనే గుట్టుగా బతుకుణ్ణాం.... నా కూతుర్ని కష్టపడి కూలినాలి జేసి చదివిస్తున్నా. కాలేజికి బోతుణ్ణింది. అసలేం జరిగింది ఏమో గాని ఒకరోజు ఎవురికి జెప్పకుండా ఎట్నో వెళ్ళిపోయింది. చుట్టుపక్కల వూళ్ళన్నీ వెతికిన గాని లాభం లేకపోయింది. వాళ్ల స్నేహితులు సినిమాల్లోకి బోయ్యిందని కొందరు? ఉద్యాగానికి బొంబాయి బొయ్యిందని కొందరన్నారు? ఊర్లో రకరకాలుగా అంటుండేసరికి ఇంక అక్కడుండలేక వొచ్చేసినా ఇట్టా దూరంగా... దూరంగా అని యేడస్తుంటే నీ కూతురు కనిపిస్తాదిలే అంటా మరో ముసల్ది ఓదారుస్తోంది బాధగానే.

ఎంగటలచ్మి కళ్ళల్లో నీళ్ళు దిరిగి ఇట్ట జెప్తావుండాది.... మేము చానా దూరాన కొండకిందపల్లెలో వుండేవోళ్ళం. నేను మా ఆయన, కొడుకు, కోడలు సేపలుపట్టి అమ్ముకొనేవోళ్ళ. లచ్చినంగానే బతుకుతున్న. యాడుణ్ణిందో ఈ దొంగలంజాముండ కోరువొచ్చింది. చినుకు బడ్తేగదా. యేడాడ్నో వుండే గుంటలు, బాయిలు, సెరువులు ఎండిపోయే, నీసులు లేకపోతే సేవలాడుంటాయా?

మాకా కాలుజెయ్యి ఆడ్తే గదా. ఎట్ట బతకబోతామబ్బా అని దిగులుపబడి బోతుంటికి ఇంతలో ఇటికిరాయి లారిలో కూలిపనికి కుదురుకున్నారు. అబ్బాకొడుకులిద్దరూ, బాగా డబ్బులొచ్చేది. ఇద్దరికి తాగుడెక్కువైంది. ఓ రోజు లోడుతో బోతుంటే లారి పల్టీగొట్టి పైనుండే ఆయన మీద రాళ్ళు బడి సచ్చిపోయినాడు. గవర్మెంటోళ్ళు డబ్బిస్తే తాగి తాగి నా కొడుకు సచ్చిపోయినాడు. కోడలేమో దాని దారి అది సూసుకుంది. ఒంటి పచ్చినైపోయ్యి ఈడ బడి వస్తావుండా అంటా యేడస్తుంది ఎగంటలచ్మి.

నొసటన విభూతిపెట్టుకున్న శాంతమ్మ కళ్ళల్లో నీళ్లు రాలేదుగాని, ఆమె ఒక్కసారి దీర్ఘంగా నిట్టూర్పు విడిచి ఇలా చెప్పసాగింది. మాకు పాతిక ఎకరాల బత్తాయి తోట, ఇంటినిండా పాడీ మా పరిస్థితి బాగుండేది. నాకు ఒక్కనొక్క కొడుకు, వాడ్ని పట్నంలో ఇంజనీరింగ్ చదివిస్తున్న ఆయన కాలం చేసి నాలుగైదేళ్ళయ్యింది. ఏమైందో ఏమో గాని ఓ రోజు ఇంటికి వచ్చాడు. ఆ రోజంతా బాగా నవ్వుతా మాట్లాడినాడు. కూరగాయలు తరగతుండి వేలు తెగితే ఆ రోజు అన్నం వాడే తినిపించాడమ్మా అంది కాసింత ఉద్వేగంగా.



# జోలె పాట

- విల్సన్ రావు కొమ్మవరపు
8985435515

అప్పుడెప్పుడో
నాలో ఒక మనిషి
నివాస ముండేవాడు
సర్వసుఖాల్ని
తృణప్రాయంగా ఎంచి
నిరంతరం శక్తి పొందుతూ
ఎండిన డొక్కల్ని
నెత్తినెక్కించుకునేవాడు...

అప్పుడెప్పుడో
నాలో ఒక మనిషి
అందరితో కలుపుగోలుగా ఉ
ండేవాడు-
భూదేవంత సహనంతో
బతుకు చక్రానికి
నిత్యం కందెన వేసి
కుటుంబానికి నమ్మకమైన
ప్రేమను పంచేవాడు...

అప్పుడెప్పుడో
నాలో ఒక మనిషి
లయతప్పని పాటై
మనసు భాషకు తప్ప
ఏ ఇతర భాషలకు లొంగనివాడై
చెమట పూల పరిమళమై
విచ్చుకునేవాడు...

ఇప్పుడు
నాలోని మనిషి
వెన్నుపోటుకు గురై
తన కాళ్ళమీద
తాను నిలబడలేక
ప్రాణవాయువును
అరువు తెచ్చుకుంటూ
బహుముఖాలుగా
విస్తరించిన
మతం ముంగిట
జోలె పడుతున్నాడు
జాలి పాటలు పాడుతూ
ప్రాధేయ పడుతున్నాడు...

*( గౌరి లంకేశ్ హత్యకు నిరసనగా)*

◆

---

తెల్లవారేసరికి ఇంటి ముందున్న వేపచెట్టుకి ఉరేసుకొని వేలాడుతుండాడు. పదిరోజుల తర్వాత తెలిసింది. అప్పటికే వాడు చెడ్డ అలవాట్లు నేర్చుకున్నాడని, కిరకెట్‌లో పందాలుగట్టి లక్షలు అప్పులైపోయినాడని. ఇల్లు, పొలాలు అన్నీ అమ్మేసి అప్పులన్నీ కట్టేసినా, నా అన్న వాళ్ళంతా ఎవరూ ఆదుకోలా, రైలెక్కి ఇట్లా దూరంగా వచ్చేసినా, నాకెవరూ లేరు... నాకెవరూ లేరు అంటూ బాధగా గొణుక్కుంటోంది శాంతమ్మ.

ఇంక జాల్లేండి ఏడుపులు, దుఃఖాలు ఒకటే సోది జెప్తావుండారుగాని పడుకోండంటూ కసిరింది. సుశీలమ్మ. పైకి అలా అందేగాని లోపల ఆమెకు బాధగానే వుంది. అందరూ ఆ పెవ్‌మెంట్‌పైనే ప్యాకింగ్ అట్టలు పరుచుకొని పాత దుప్పట్లు కప్పుకొని పడుకున్నారు.

చల్లగా గాలి తోలుతోంది. సెకండ్ షో వదిలేశారేమే రోడ్డంతా నిర్మానుష్యమైపోయింది. ఆకాశంలో ఓపక్క నెమ్మదిగా మబ్బులు కమ్ముకుంటున్నాయి. నక్షత్రాలు దూరంగా బిక్కు బిక్కుమంటున్నాయి. అక్కడంతా ప్రశాంతంగా వుంది. ఎంత ప్రశాంతంగా వుందంటే ఆ నిశ్శబ్దాన్ని చూసి చీకటే భయపడేంతగా వుంది.

అంతా నిశ్శబ్దం.. అంతా ప్రశాంతం.. నిద్రిస్తున్న వాళ్ళ మొహాలు పసిపాపల నవ్వుల్లా వున్నాయి. అంటే ఎక్కడ్నుంచి వచ్చిందోగాని గరుత్మంతుడు పాములాగా వేగంగా వచ్చిందో ఇసుక లారీ. పేవ్‌మెంట్ పైకి ఎక్కింది. అంతే ఓ చిన్న మూల్గు... ఎక్కడి వాళ్ళక్కడే ఛిద్రమైపోయారు. ఆ ప్రాంతమంతా రక్తంతో తడిసిపోయింది. ఆ రక్తంలో విసిరేసినట్టు చిల్లర డబ్బుల్తో చెల్లాచెదురైన శరీరభాగాలతో యుద్ధరంగంలా వుంది అక్కడి పరిస్థితి.

ఆ భయంకర దృశ్యం చూసిన మబ్బులు బావురుమంటూ కన్నీరు కార్చాయి. ఆ విలయానికి తట్టుకోలేని గాలి, చేష్టలు ఆపి బిగుసుకుపోయింది.

తాగిన మత్తులో వున్న డ్రైవర్ లారీతో వెళ్లిపోయాడు. దాని ఓనర్ ఎవరో? ఎవరితో మాట్లాడాడో గాని కేసు ఊసే లేకపోయింది. అలా ఆ నిర్భాగ్యుల జీవితాలు గాలిలో కలిసిపోయాయి.

వాళ్ళు ఎవరో... ఏ ఊర్లో ఎవరికి తెలియదు.... ఎప్పటికి తెలీయదు ఒక్క కాలానికి తప్ప.

◆

# స్వీకారం

## టోపి జబ్బార్ కథలు

**వేంపల్లె షరీఫ్**

**వెల : 125 పేజీలు: 142**

**ప్రతులకు : 9603429366**

**ఈ** కథలు కొంత వెలుగును ప్రసరిస్తున్నాయి. అనేక అంశాల గురించి కొత్త వెలుతురునూ పంచుతున్నాయి. ఇతని కథనాత్మక వచనం, వాచకంగా మారి మనలను క్రమక్రమంగా ఆవహిస్తుంది. ఆక్రమిస్తున్నది కూడా. అయితే క్వీన్ పేర్కొన్నట్లుగా మన ఆలోచనా పద్ధతిని కథకుడు ఉద్దేశించిన అన్ని దిశలకూ, చైతన్య తీరాలకూ మరల్చుతూ ఉంటుంది.

**- సీతారాం**




## నిరసన స్వరాలు

**సంపాదకత్వం: కె. సత్యరంజన్**

**వెల : 30/- పేజీలు: 48**

**ప్రతులకు : ప్రజాశక్తి బుక్‌హౌస్**

**గ**రగపర్రు, దేవరపల్లి, అగిరిపల్లి, చిత్తూరు జిల్లా మహాభారత ఉత్సవ సంఘటనల నేపథ్యంలో జూలై 24న విజయవాడలో జరిగిన జాషువా వర్ధంతి సభలో జనకవనం జరిగింది. ఆ కవితల సమాహారమే 'నిరసన స్వరాలు'. ఆనాడు ప్రధాన వక్తగా 'జాషువా సాహిత్యం – వర్తమానం' అంశంపై డా॥ చల్లపల్లి స్వరూపరాణి ప్రసంగించారు. తన మరో వ్యాసం 'విగ్రహాలు మాట్లాడే భాష' ఈ పుస్తకానికి చేర్చడం జరిగింది.

**- ప్రచురణ కర్తలు**




## సాహితీ సుగంధం

**డా॥ పి.వి. సుబ్బారావు**

**వెల : 100/- పేజీలు: 144**

**ప్రతులకు : 9849177594**

**సు**బ్బారావు గారి ఈ వ్యాసాలు సులభశైలిలో వున్నాయి. అభ్యుదయ దృష్టిని ప్రసరిస్తున్నాయి. సామాజిక హితంగా సమాచార సహితంగా వుండటం ఒక ప్రత్యేకత. ఈ వ్యాసాల ద్వారా పలువురి సాహితీవేత్తలతో పరిచయమేర్పడుతుంది. ఈ వ్యాసాలు కొన్ని కవిత్వం, కథలు, నవలలను పాఠకులకు చేరువ చేస్తున్నాయి.

**- పెనుగొండ లక్ష్మీనారాయణ**




## నానీ వీచికలు

**మాయకుంట్ల నారాయణ రెడ్డి**

**వెల : 60/- పేజీలు: 80**

**ప్రతులకు : 9989686603**

**నా**రాయణ రెడ్డి మొన్నటిదాకా కవి కాదు. ఒక్క గ్రంథమూ రాయలేదు. ఇదే ఆయన తొలి సంపుటి. తొలి సంపుటే కాని తొలకరి సంపుటి కాదు. పరిణత మనస్కత లోంచి వెలువడిన అనుభవ రత్నాలీ నానీలు. దేనిని ముట్టుకున్నా కవితాత్మకత, దేశీయత, వ్యక్తీకరణ పారీణత ముప్పేటలుగా ద్యోతకమౌతాయి.

**- డా॥ ఎన్. గోపి**




## సామాన్యుని సాక్షాత్కారం.... కవితలు

**డా॥ కె. బాబూరావు**

**వెల : 100/- పేజీలు: 111**

**ప్రతులకు : 9849858524**

**త**న అనుభూతుల ఆస్తుల పంపిణీకి పూనుకుని సహృదయ మిత్రుల, సుపుత్రుల, పవిత్రుల బృందం ఒక్కసారి విని ఆనందించటం కోసం బాబూరావు గారు యీ సంపుటిని వేస్తున్నాడు.

**- ఆచార్య చందు సుబ్బారావు**




## చారాణా కథలు

**వహీద్‌ఖాన్**

**వెల : 100 పేజీలు: 95**

**ప్రతులకు : 9441946909**

**'చా**రాణా' నుండి "కదిలిన రైలు" వరకు పన్నెండు కథల్లోనూ తన చుట్టుప్రక్కల, సమాజంలో జరుగుతున్న, తాను స్వయంగా చూసిన, చూస్తున్న అంశాలనే కథాంశాలుగా ఎంచుకున్నారు. కథల ముగింపు ఇవ్వడంలోనే అసలు వహీద్ గారి ప్రాపంచిక దృక్పథం ఏమిటో మనకు తెలిసివస్తుంది.

**- కె. ఆనందాచారి**

## నానీలు

- రత్నాల బాలకృష్ణ
9440143488



కిరణాల కుంచెతో
రంగులద్దుతుంది
దీపం
ఓ గొప్ప చిత్రకారుడు !

మరణానికి
ప్రేమలేఖ రాసా
అమృతాన్ని
ప్రేమకానుకగా యిచ్చింది

భూమికి ఊపిరితిత్తులు
సముద్రం
ఆటుపోటులే
ఉచ్ఛ్వాస నిశ్వాసలు

చంద్రుడు
పగలబడి నవ్వితే పున్నమి
చిరునవ్వు నవ్వితే
నెలవంక

నేల నాదన్నాను
ఫక్కున నవ్వింది
నింగి నాదన్నాను
ఆహ్వానం పలికింది

కూతురుగా హత్యచేసి
కోడలుగా
పునరుజ్జీవింపజేస్తుంది
వివాహం

సూర్యుడు
తూర్పున ఉదయించడు
ఉదయం కనిపించే
దిక్కుపేరు తూర్పు

సూర్యుడికి
లేదు రాత్రి పగలు తేడాలు
ఆ భేదాలన్నీ
భూమికే

తాటిచెట్టుకు
క్షవరం చేసినా
నీడనిచ్చే
గొడుగునిస్తుంది

భక్తులకు భక్తి ఎక్కువై
పూజారి దేవుడయ్యాడు
భక్తి
పూజ్యమయింది.

◆

## నిజం నిట్టూర్పు

- ప్రవీణ్ వెలువోలు
9494027479



నిజజీవితాల్ని...
నిస్తేజంగా చూస్తున్నాయి ఆ కళ్ళు
దేహమంతా మొద్దుబారి
మనస్సు మైనంగా కరిగిపోయింది
నిగూఢమైన అర్థాల్నీ, అగాధాల్నీ ...
అద్దంలో వెతుకుతున్నాయి
నింపాదిగా నిల్చున్న శరీరం
అణువణువూ ఆవిరౌతున్న ఆవేదన
కణం కణంలోని భౌతికవాదం
'మనం మనం'తో మకిలిపట్టింది
అదిగో అర్థం, పరమార్థం...

అవమానంతో అల్లల్లాడుతోంది
ఆర్ద్రతలేని ఆలోచనలకు
ఆయాసం ఎందుకు..?
నమ్మకాన్ని అమ్మేస్తే సరి
కాసులు కన్నీళ్ళు తుడుస్తాయా..?
కాలిన జీవితాన్నడగాలి
నిగ్రహమే సరైన త్యాగం
నిద్రావస్థలో పడిన భవితవ్యం
నా ఆశ న్యాయమైతే
నీ ధ్యాస తటస్థం
చివరికి నిట్టూర్పే సమాధానం
నీకైనా... నాకైనా...

◆

# రావాల్సిన సమయానికే వచ్చిన సాహిత్య ప్రస్థానం



- డా॥ కె. శ్రీనివాసులు రెడ్డి
9493212454



*ఈ నేపథ్యంలోంచి చూసినపుడు **2002** లో ప్రారంభమైన 'సాహిత్య ప్రస్థానం' వయసు తక్కువే అయినా ప్రయాణించిన దూరం చాలానే ఉందనిపిస్తోంది. **2000** వ సంవత్సరం నుండి సమాజం ప్రపంచీకరణ వల్ల ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక, విద్యా, వ్యాపార, సాహిత్య రంగాలలో తీవ్ర మార్పులకు లోనయ్యింది. నయా సామ్రాజ్యవాదం, మత ఛాందస వాదం, పౌరహక్కుల హననం, మానవ సంబంధాల పతనం, అభివృద్ధి పేరుతో విధ్వంసం. ప్రజాస్వామ్యంలో నియంతృత్వం, అసహన వాతావరణం వంటివి దేశంలో పెరిగిపోతున్న సందర్భం. దీనిని అర్థం చేసుకోవడంలో సాధారణ ప్రజలు గందరగోళానికి గురయ్యారు. సరిగ్గా రావాల్సిన సమయానికే వచ్చింది ప్రస్థానం.*

మానవ ప్రస్థానానికి మార్గం సుగమం చేసి ముందుకు నడిపించడంలో సాహిత్యానిది కీలకపాత్ర. మానవ వికాస పథంలోని ప్రతి కీలక మలుపులోనూ సాహిత్యం ఒక చోదకశక్తిగా పనిచేసింది. మానవ నాగరికత ఇప్పుడున్న స్థితికి రావడంలో ఆది నుంచీ అది ఎన్నో ఆటుపోట్లను, సంక్షోభాలనూ మరెన్నో ఆటంకాలను ఎదుర్కొన్నది. అన్ని సందర్భాలలోనూ సాహిత్యము, సైన్సు నూతన ప్రతిపాదనలతో, సిద్ధాంతాలతో ఆచరణ రూపాలైన ఉద్యమాలను, పోరాటాలను ప్రజల ముందుంచి చైతన్యం కలిగించాయి. ఆ కాగడా వెలుగులో నడిచిరి మనుషులు. ఆ దీపధారి సాహిత్యమే. ఎదుటి జీవి వేదన చూడలేని హృదయం నుండీనో, జానపదుని కాయకష్టం నుండీనో పెల్లుబికిన శోకమో, సంతోషమో కవిత్వమైంది. అలా సన్నని పాయగా మొదలైన సాహిత్యం సెలయేరుగా, జలపాతంగా పరవళ్ళు తొక్కింది. కథ, పాట, నవల వంటి అనేక ప్రక్రియలనే ఉపనదులను తనలో కలుపుకొని జీవనదిలా ప్రవహిస్తోంది. ఆపై ఎన్నో పాయలుగా చీలి లోకం చూడని భూమి పుత్రలను, చూడ ఇచ్చగించని నల్లజాతివారినీ, పతితుల్నీ, భ్రష్టుల్నీ, బాధా సర్పద్రష్టుల్నీ, సమాజం దూరంగా నెట్టేసిన దళితుల్నీ, సమాజాన్ని చూడనివ్వకుండా చీకట్లో మగ్గిన మహిళల్నీ, మైనారిటీలను, నిరాశ్రయులను, ప్రపంచీకరణ రాబందు నీడ సోకి సృక్కుతున్న వారినీ చేరింది. వారిలో చైతన్యాంకురాలను మొలిపించింది. ఇది సాహితీ తరంగిణి ప్రవాహం. ప్రజాభ్యుదయమనే సంద్రంలో కలవడమే దీని పరమ లక్ష్యం.

ఇందులో సాహిత్యాన్ని ప్రజలకు చేరువ చేసి, ప్రజాసమూహాల్ని ఐక్యం చేసి ప్రజాశక్తి కూడగట్టే పని ఎంతో కీలకమైనది. ఆ పనిని సమర్థవంతంగా చేయగలిగేది పత్రిక. 'పత్రికొక్కటున్న పదివేల సైన్యమ్ము, ప్రజకు రక్ష లేదు పత్రిక లేకున్న 'అన్న నార్ల మాట చారిత్రక యథార్థం. అచ్చు లేని కాలంలో వ్యక్తులే సాహితీ వ్యవస్థలుగా వ్యవహరించి సమాజాన్ని నడిపించారు. పత్రికలొచ్చిన తర్వాత ప్రజాభిప్రాయాన్ని కూడగట్టడంలో, దొరలకు, దోపిడీలకు వ్యతిరేకంగా ప్రజాశక్తులను సమీకరించడంలోనూ పత్రికలే ప్రముఖ పాత్ర వహించాయి. స్వాతంత్రోద్యమ కాలంలో తెల్లవారి నుండి దాస్య విముక్తి కోసం పత్రికలు పనిచేశాయి. తర్వాత దక్కిన స్వేచ్ఛను దేశ ప్రజ సమానంగా అనుభవించడానికి కావాల్సిన సమాజ

నిర్మాణంలో అభ్యుదయ శక్తుల సమీకరణం, ఆ సమ సమాజ నిర్మాణానికి బలమైన తాత్విక పునాదుల నిర్మాణానికి, దానికి కావాల్సిన మేథో మథనానికి, చర్చకు పత్రికలు వేదికగా నిలిచాయి.

ఈ నేపథ్యంలోంచి చూసినపుడు 2002 లో ప్రారంభమైన 'సాహిత్య ప్రస్థానం' వయసు తక్కువే అయినా ప్రయాణించిన దూరం చాలానే ఉందనిపిస్తోంది. 2000 వ సంవత్సరం నుండి సమాజం ప్రపంచీకరణ వల్ల ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక, విద్యా, వ్యాపార, సాహిత్య రంగాలలో తీవ్ర మార్పులకు లోనయ్యింది. నయా సామ్రాజ్యవాదం, మత ఛాందస వాదం, పౌరహక్కుల హననం, మానవ సంబంధాల పతనం, అభివృద్ధి పేరుతో విధ్వంసం. ప్రజాస్వామ్యంలో నియంతృత్వం, అసహన వాతావరణం వంటివి దేశంలో పెరిగిపోతున్న సందర్భం. దీనిని అర్థం చేసుకోవడంలో సాధారణ ప్రజలు గందరగోళానికి గురయ్యారు. సరిగ్గా రావాల్సిన సమయానికే వచ్చింది ప్రస్థానం.

ప్రగతిశీల సాహితీ శక్తులను పునఃస్సమీకరణం చేయడం, విశాల ప్రాతిపదికన సాహితీ సృజన, చర్చ వంటి ఆశయాలతో 'సాహిత్య ప్రస్థానం' ఆవిర్భవించిందని పత్రిక సంపాదకీయాలు స్పష్టం చేస్తున్నాయి. సాహిత్య వికాసంతో సామాజిక చైతన్యం సాధ్యమని ప్రస్థానం నమ్మకం. ఆ దిశగా ప్రస్థానం సాహిత్య పత్రికతో పాటు 'సాహితీ స్రవంతి' ద్వారా సాహిత్య కార్యక్రమాలను, సాహిత్యశాలల ద్వారా సాహిత్య శిక్షణను నిర్వహిస్తోంది. దర్పణం, గమనం, ప్రస్థానం, దిక్సూచి, కథన శాల, స్వేచ్ఛాస్వరం పేరుతో ప్రత్యేక సంచికలు తీసుకు వచ్చింది. వెలుగు దివిటీలైన గురజాడ, శ్రీశ్రీ, అద్దేపల్లిల పై కూడా ప్రత్యేక సంచికలను వెలువరించింది. 'జనకవన' కవితా సంకలనాలతో ప్రపంచీకరణ వ్యతిరేక కవిత్వానికి వేదికనేర్పరచింది.

అధిక పాఠకులను ఆకర్షించడం కోసం, సంచలనాల కోసం అనవసరంగా వివాదస్పద అంశాలను ప్రచురించలేదు. రాద్దాంతం చేయలేదు. సిద్ధాంతం నుండి పక్కకు పోలేదు. పదహైదు సంవత్సరాలుగా నిబద్ధత వీడలేదు. అంతే కాదు రచయితలలోని అవాంఛనీయ ధోరణులను, హ్రస్వ దృష్టిని ప్రశ్నించింది (చూ.ఆలోచించరా... సంపాదకీయం, ఫిబ్రవరి 2012). పత్రిక తీరుపైన, తీసుకురావాల్సిన మార్పులపైన పాఠకుల అభిప్రాయాలకు విలువనిచ్చింది. వారినీ భాగస్వాముల్ని చేసింది. ఎందరో యువ, నవ కవుల, రచయితల రచనలు ప్రచురించి ప్రోత్సహిస్తోంది. కొత్తగా రాసే వారు చాలా మంది తమ రచనల్ని అచ్చులో మొదటగా 'ప్రస్థానం'లో చూసుకున్నారు.

అభ్యుదయవాదులమని చెప్పుకొనే చాలా మందిలో మతోన్మాదాన్ని ఖండించే విషయంలో ద్వంద్వ వైఖరి కనిపిస్తుంది. హిందూ మతోన్మాదం మాత్రమే ఉన్మాదమని, ఇస్లాం, క్రైస్తవ మతోన్మాదాలు ఉన్మాదం కాదేమోననే వారు వాటి పట్ల ఉద్దేశ్యపూర్వక మౌనాన్ని ఆశ్రయిస్తారు. తస్లీమా నస్రీన్ పై ఇస్లామిక్ ఛాందస వాదుల దాడిపై దేనికి భయపడో ఇప్పుడు గొంతు చించుకుంటున్న వారికి నోరు పెగల్లేదు. కానీ 'ప్రస్థానం' స్పష్టంగా దాడిని ఖండించింది (చూ. డిసెంబర్ 2007). కంచె ఐలయ్య 'హిందూ మతాంతర భారత దేశం' పై తెలకపల్లి రవి గారి విమర్శ సహేతుకంగా ఉంది. 'అతి'ని ఖండించే విషయంలో ప్రస్థానం రాజీ పడలేదు. అదెక్కడ ఉన్నా సరే.

సాహిత్య ప్రస్థానంలో 15 సంవత్సరాలు అతికొద్ది కాలమే అయినా ఒక పత్రికకు అది చెప్పుకోతగ్గ ప్రయాణమే. నేను 2003 నుండి ఇప్పటి వరకు దాదాపు అన్ని సంచికలూ చూసాను. మొదట్లో పత్రికలో పేజీలూ, ప్రమాణాలు కూడా ఎక్కువగానే ఉండేవి. లబ్ద ప్రతిష్టులైన రచయితలు రాశారని కాదు కొత్త వారు రాసినా ప్రమానాలు తగ్గకూడదు కదా ! అంతే కాదు పాత సంచికలతో పోల్చినప్పుడు ముఖ చిత్రాలు సాహిత్య పత్రిక స్థాయిలో లేవనిపించింది. 'అభినందనలు - అభిప్రాయాలు', 'ఈ రచనలు ఎవరివి? ఎందులోవి?', 'చర్చ' వంటి శీర్షికలు పాఠకులు స్పందన లేక నిలిచిపోయాయి. కొత్త సంవత్సరంలో సరికొత్త శీర్షికలతో పాఠకాదరణ పొందాలని ఆశిద్దాం. పేజీలు పెరుగుతున్నందున కళ, తాత్విక అంశాలకు కూడా చోటు కల్పిస్తే బాగుంటుందేమో! సాహిత్యానికి కావాల్సిన తాత్విక పునాదుల పైన అవగాహన ఉండి నిర్మించే సాహిత్యం సార్వకాలికతను సంతరించుకుంటుంది. సమకాలీనతను కలిగి ప్రకాశిస్తుంది. ఈ 'సాహిత్య ప్రస్థానం' మహా కవి శ్రీశ్రీ ఆశించిన మరో ప్రపంచం మన ప్రపంచం చేరే దాక నడక కొనసాగిస్తుందనీ, మనం కూడా కదం తొక్కుతూ, పదం పాడుతూ అడుగు కలుద్దామని కోరుతూ....

పత్రిక పట్ల సంపాదక వర్గానికి ఉన్న నిబద్ధత, నిజాయితీ, నాలోని సాహిత్యాభిలాష నన్నీ మాటలు మాట్లాడించాయి. ధన్యవాదాలు.

## గుంటూరులో జాషువా జయంత్యుత్సవాలు



గుంటూరులో సెప్టెంబర్ 22 నుండి 28 వరకు జాషువా సాంస్కృతిక పీఠం ఆధ్వర్యంలో వెంకటేశ్వర విజ్ఞానమందిరంలో జరిగిన జాషువా జయంత్యుత్సవాల్లో భాగంగా సెప్టెంబర్ 27న జరిగిన దళిత లిటరరీ ఫెస్టివల్ కార్యక్రమం. చిత్రంలో సతీష్‌చందర్, పసునూరి రవీందర్, పాపినేని శివశంకర్, ఎండ్లూరి సుధాకర్, రాచపాళెం చంద్రశేఖర రెడ్డి, డొక్కా మాణిక్య వరప్రసాద్, కొలకలూరి ఇనాక్ తదితరులు.

కుల జాడ్యం సమాజాన్ని పట్టి పీడిస్తుందని ఎమ్మెల్సీ డొక్కా మాణిక్యవరప్రసాద్ అన్నారు. గుర్రం జాషువా 122వ జయంత్యుత్సవాల్లో భాగంగా సెప్టెంబర్ 27న గుంటూరులో వెంకటేశ్వరా విజ్ఞాన మందిరంలో దళిత్ లిటరసీ ఫెస్టివల్ నిర్వహించారు. ఈ కార్యక్రమానికి దేశ వ్యాప్తంగా సుమారు 40 మంది కవులు, రచయితలు హాజరయ్యారు. తొలుత కన్నావారితోటలో జాషువా విగ్రహానికి ఆచార్య కొలకలూరి ఇనాక్ పూలమాల వేసి నివాళులర్పించారు. అక్కడి నుండి విజ్ఞాన మందిరానికి ఆచార్య ఎండ్లూరి సుధాకర్‌ను భారీ ఊరేగింపు మధ్య తీసుకొచ్చారు. అనంతరం దళిత్ లిటరసీ ఫెస్ట్‌కు ఇనాక్ అధ్యక్షత వహించారు. డొక్కా మాణిక్యవరప్రసాద్ మాట్లాడుతూ కులసమాజం కూలిన నాడు భారతీయ సమాజం ప్రపంచంలో గర్వంగా ఎదుగుతుందన్నారు. ముఖ్య అతిథిగా పాల్గొన్న శరణ్‌కుమార్ సిబాల్ మాట్లాడుతూ ప్రపంచ వ్యాప్తంగా అనేక రూపాల్లో వివక్షత ఉన్నప్పటికీ దేశంలో లింగవివక్ష, అస్పృశ్యత, వెలివేత బతుకులు ఉన్నాయన్నారు. ఆచార్య ఎండ్లూరి సుధాకర్ మాట్లాడుతూ జాషువా సాహిత్యం ఒక్క రోజులో ఆవిష్కరించింది కాదని, తరతరాల వేదనకు వ్యతిరేకంగా ఆయన సమరశంఖం పూరించాడన్నారు. కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత పాపినేని శివశంకర్ మాట్లాడుతూ తన సాహిత్యంపై జాషువా ప్రభావం అధికంగా ఉందన్నారు. ఈ సందర్భంగా జాషువా పురస్కారాలను ఎండ్లూరి సుధాకర్, పాపినేని శివశంకర్‌కు అందచేశారు. పలు రాష్ట్రాల రచయితలు మతివన్నన్, శశికుమార్, ఎస్.చంద్రమోహన్, రమేష్, గోగు శ్యామల, డాక్టర్ పసునూరి రవీంద్ర తదితరులు పాల్గొన్నారు.



విశాఖపట్నం సాహితీస్రవంతి ఆధ్వర్యంలో సెప్టెంబర్ 21న గురజాడ 155వ జయంతి సందర్భంగా కాంప్లెక్స్ వద్ద గల గురజాడ విగ్రహానికి పూలమాల వేసి నివాళి అర్పిస్తున్న దృశ్యం. చిత్రంలో ఎ.వి. రమణారావు, కామేశ్వరరావు, బాలకృష్ణ, చంద్రమౌళి, ప్రకాశరావు, చౌదరి, విరియాల గౌతమ్ తదితరులు.

## చిన్న కథల పోటీ

సాహితీకిరణం సహకారంతో నిర్వహిస్తున్న ముట్టూరి కమలమ్మ స్మారక జాతీయ స్థాయి దీపావళి చిన్న కథల పోటీకి కథలను ఆహ్వానిస్తున్నట్లు సాహితీకిరణం సంపాదకులు పొత్తూరి సుబ్బారావు ఒక ప్రకటనలో తెలిపారు. 'అంతరిస్తున్న మానవతా విలువలు - అందుకు పరిష్కారం' అనే అంశంపై ఎ4 సైజు పేపర్ 5 పేజీలు, డి.టి.పి. అయితే 2 పేజీలతో కథ రాసి పంపవలసిందిగా కోరారు. ఐదు కథలకు ఒక్కో కథకి రూ.1000లు బహుమతిగా అందజేయనున్నట్లు, 31.10.2017 లోపుగా 'సాహితీకిరణం, 11-13-154, అలకాపురి కాలనీ, రోడ్ నెం. 3, హైదరాబాద్ - 500 102 చిరునామాకు పంపవలసిందిగా కోరారు. ఇతర వివరాలకు 040-20060181 ద్వారా సంప్రదించవచ్చును.

## ఉమ్మడిశెట్టి త్రిదశాబ్ది పురస్కారం

'ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డు- త్రిదశాబ్ది పురస్కారం - 2017 కోసం కవుల నుండి కవితా సంపుటాలను ఆహ్వానిస్తున్నట్లు డా॥ ఉమ్మడిశెట్టి రాధేయ ఒక ప్రకటనలో తెలిపారు. 2017లో ప్రచురించిన కవితా సంపుటాలను 31.12.2017లోపుగా 'డా॥ ఉమ్మడిశెట్టి రాధేయ, అవార్డు వ్యవస్థాపకులు, 13-1-606-1, షిర్డినగర్, రెవిన్యూ కాలనీ, అనంతపురం - 515 001 చిరునామాకు పంపవలసిందిగా కోరారు. ఇతర వివరాలకు 9985171411 ద్వారా సంప్రదించవచ్చును. ◆

# 'గుర్రం జాషువా సాహిత్య పురస్కార' ప్రదాన సభ

ప్రజాకవి గుర్రం జాషువా 122వ జయంతి ఉత్సవాల్లో భాగంగా సెప్టెంబర్ 26న గుంటూరులో వెంకటేశ్వర విజ్ఞాన మందిరంలో ప్రజానాట్య మండలి, గుర్రం జాషువా విజ్ఞాన కేంద్రం సంయుక్త ఆధ్వర్యంలో ప్రముఖ రచయిత నల్లి ధర్మారావుకు 'జాషువా కవితా పురస్కారం' అందజేశారు. సభకు సాహితీవేత్త, నర్సరావుపేటలోని జిల్లా రిజిస్ట్రార్ చావలి బాలస్వామి అధ్యక్షత వహించారు. స(ర్)రాజు బాలరాజు జ్యోతి ప్రజ్వలన చేశారు. ప్రముఖ సామాజిక విశ్లేషకులు తెలకపల్లి రవి మాట్లాడుతూ జాషువ ప్రగతిశీల కవి అని, పీడితుల వేదన ప్రతిధ్వని అని పేర్కొన్నారు. కుల పంజరాలు తయారు చేసుకుంటున్న నేటి తరుణంలో జాషువా సాహిత్యం ఎంతో ప్రాధాన్యత సంతరించుకుందన్నారు. దేశంలో గోసంరక్షణ దళాల పేరుతో జరుగుతున్న దారుణాలు మనిషి సాటి మనిషి కంటే నందికి ప్రాధాన్యత ఇస్తున్నాడని జాషువా చెప్పిన పద్యాన్ని గుర్తు చేస్తుందన్నారు. జాషువా కవిత్వం పురాణాలు, జీవన వేదనతో ప్రారంభమై చివరి దశలో మానవతా వాదం, కార్మిక రాజ్యం స్థాపన కావాలనే దిశగా సాగిందన్నారు.

ప్రముఖ రచయిత డాక్టర్ కోయి కోటేశ్వరరావు మాట్లాడుతూ కాషాయి శక్తులు చెలరేగుతున్న ప్రస్తుత తరుణంలో జాషువా సాహిత్యాన్ని మరింతగా అధ్యయనం చేయాల్సిన అవసరం ఉందన్నారు. సామాజిక, ఆర్థిక, రాజకీయ ఉద్యమాలకు ఆయన సాహిత్యం స్ఫూర్తినిస్తుందన్నారు. జాషువ పీడనలు, అవమానాలు ఎదుర్కొన్నాడని, సామాజిక అస్తిత్వం నేపథ్యంలో ఆయన సాహిత్యాన్ని చూడాలన్నారు. జాషువాపై గాంధీ, నెహ్రూ, బుద్ధుడు, అంబేద్కర్ భావజాల ప్రభావం ఉందన్నారు. అయితే కాల క్రమంలో కాంగ్రెస్ విధానాలను అంబేద్కర్‌లా జాషువా కూడా అనుమానించాడన్నారు. నేడు సమాజంలో నెలకొన్న సాంఘిక ఉగ్రవాదం, ఆర్థిక తీవ్రం వాదం గురించి జాషువా ఆనాడే హెచ్చరించాడన్నారు. అధ్యక్షోపన్యాసం చేసిన చావలి బాలస్వామి మాట్లాడుతూ కుల రహిత సమాజం కోసం పోరాడిన జాషువా సాహిత్యాన్ని విస్తృతంగా ప్రజల్లోకి తీసుకెళ్లాలన్నారు. జయంతి ఉత్సవ కమిటీ గౌరవాధ్యక్షులు డాక్టర్ పి.ముత్యం మాట్లాడుతూ జాషువాను ఒక కులానికి, మతానికి పరిమితం చేయకూడదని, సమాజంలో నెలకొన్న అన్ని రకాల రుగ్మతలపై ఆయన రచనలు సాగించాడనే విషయాన్ని గుర్తించాలన్నారు. జాషువ విజ్ఞాన కేంద్రం మేనేజింగ్ ట్రస్టీ పాశం రామారావు మాట్లాడుతూ జాషువా ఆశించిన సమాజం




ప్రజానాట్యమండలి, గుర్రం జాషువా విజ్ఞానకేంద్రం సంయుక్త ఆధ్వర్యంలో గుంటూరులో సెప్టెంబర్ 26న జరిగిన 'జాషువా సాహిత్య పురస్కారం' సభలో ప్రసంగిస్తున్న పురస్కార గ్రహీత నల్లి ధర్మారావు. చిత్రంలో డొక్కా మాణిక్య వరప్రసాద్, తెలకపల్లి రవి, కొలకలూరి ఇనాక్, కె.ఎస్. లక్ష్మణరావు, పాశం రామారావు తదితరులు.

ఇంకా ఆవిర్భవించలేదని అందువల్లే ఆయన రచనలు, పద్యాలను ప్రజల్లో విస్తృత ప్రాచుర్యం కల్పించడం కోసం గత మూడేళ్లుగా తమ సంస్థ జయంతి ఉత్సవాలను నిర్వహిస్తోందని వివరించారు. 70 ఏళ్ల స్వతంత్ర భారత దేశంలో నేటికీ దళితుల బతుకులు మారలేదన్నారు. ఇప్పటికీ కుల వివక్ష, అంటరానితనం కొనసాగుతున్నాయన్నారు. గరగపర్రు, గుంటూరు జిల్లాలోని బయ్యారంలో చోటు చేసుకున్న ఘటనలే దీనికి ఉదాహరణ అని పేర్కొన్నారు. ఎమ్మెల్సీ డొక్కా మాణిక్య వరప్రసాద్ మాట్లాడుతూ దేశంలో కులం లేదని చెప్పటం పెద్ద అబద్ధమన్నారు. ఒక వైపు అభివృద్ధి జరుగుతుంటే మరోవైపు సామాజిక అంతరాలూ పెరుగుతున్నాయన్నారు. తెలుగు భాషా పరిరక్షణకు మాటలు చెప్పకుండా ఆచరణ రూపంలో కృషి చేయాలన్నారు. సాహిత్యాన్ని కళల ద్వారా ప్రజల్లోకి తీసుకెళ్లటం ద్వారానే ఇది సాధ్యమన్నారు. మాజీ ఎమ్మెల్సీ కెఎస్ లక్ష్మణరావు మాట్లాడుతూ జిల్లా సామాజిక, ఆర్థిక, సాంఘిక చరిత్రను ప్రజలకు తెలియచెప్పటానికి జాషువ విజ్ఞాన కేంద్రం ఏర్పాటు చేయబడిందని, భవిష్యత్‌లో ఈ ట్రస్ట్ ద్వారా విస్తృత కార్యక్రమాలు చేపడతామన్నారు.

విద్యుత్ ఉద్యమం, సమాజంలో నెలకొన్న అనేక రుగ్మతలు, ఉత్తరాంధ్ర సమస్యలపై నల్లి ధర్మారావు రచనలను ప్రజానాట్యమండలి జిల్లా ప్రధాన కార్యదర్శి పి.వి.రమణ సభకు పరిచయం చేశారు. వక్తలను నూతలపాటి కాళిదాసు వేదికమీదకు ఆహ్వానించారు. తొలుత ప్రజానాట్యమండలి కళాకారులు ప్రదర్శించిన పాటలు, నృత్యరూపకాలు, పద్యాలు విశేషంగా ఆకట్టుకున్నాయి. కార్యక్రమంలో కొలకలూరి ఇనాక్, పోపూరి రామారావు, నూతలపాటి కాళిదాసు, బి వేదయ్య, ఎం ఏసుదాసు, కూచిపూడి రవిశేఖర్, నన్నపనేని అయ్యన్‌రావు, పాటిబండ్ల ఆనందరావు తదితరులు పాల్గొన్నారు.

## 'నిరసన స్వరాలు' ఆవిష్కరణ



విజయవాడలో ఎం.బి. విజ్ఞానకేంద్రంలో సెప్టెంబర్ 9న జరిగిన 'నిరసన స్వరాలు' కవితా సంకలనం ఆవిష్కరణ సభ. చిత్రంలో ఆవిష్కర్త పాటూరు రామయ్య, రాచపాళెం చంద్రశేఖర రెడ్డి, చల్లపల్లి స్వరూపరాణి, ఎం.వి.ఎస్. శర్మ, ఆంధ్ర మాల్యాద్రి, వొరప్రసాద్

నిరసన గళాలను సమైక్యంగా వినిపించాలని కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి పిలుపునిచ్చారు. గరగపర్రు, దేవరపల్లి, అగిరిపల్లి, చిత్తూరు జిల్లా మహాభారత సంఘటలన నేపథ్యంలో జులై 24న జాషువా వర్ధంతి సభలో చదివిన కవితల సంకలనం 'నిరసన స్వరాలు' ఆవిష్కరణ సభ విజయవాడలోని ఎంబి విజ్ఞాన కేంద్రంలో సెప్టెంబర్ 9న జరిగింది. ఈ సభకు ప్రధానవక్తగా హాజరైన ఆయన మాట్లాడుతూ ఏ సమాజంలోనైనా మార్పు అనివార్యమన్నారు. సమాజంలో జరుగుతున్న సంఘటలను జాషువా తన కవితల్లో పేర్కొన్నారన్నారు. జాషువా రచనలను సొంతం చేసుకునే పని కవులందరూ మొదలుపెట్టాలన్నారు. సమాజాన్ని అధ్యయనం చేయాలని సూచించారు. పూర్వ కవుల రచనల్ని చదవడం వల్ల మెరుగ్గా కవితలు రాయొచ్చ న్నారు. దేశానికి నిజంగా స్వాతంత్ర్యం వచ్చి ఉంటే గౌరీ లంకేశ్ హత్య లాంటి ఘటనలు జరిగేవి కాదన్నారు. 70 ఏళ్లలో దేశం ఏం మారిందని ప్రశ్నించారు. ఆధునిక తెలుగు కవుల చరిత్రను నిరసనల చరిత్రగానే భావించాలన్నారు. ఎన్ని ఉద్యమాలు జరుగుతున్నా జరగాల్సిన దారుణాలు జరిగిపోతున్నాయన్నారు. నిరసన స్వరాలులో ప్రచురించిన కవితల గురించి వివరించారు. నిరసన స్వరాలు సంకలనాన్ని ఆవిష్కరించిన ప్రజాశక్తి ఎడిటర్ పాటూరు రామయ్య మాట్లాడుతూ విప్లవానికి సాహిత్యం స్ఫూర్తినిస్తుందన్నారు. సాహిత్యం లేకపోతే ప్రజలు చైతన్యవంతులు కాలేరన్నారు. ప్రజా ఉద్యమాలను, పోరాటాలను అధ్యయనం చేసి కవితలు రాయాలని సూచించారు. రచయితల ఉద్వేగం ప్రజలకు అర్థ మయ్యేలా ఉండాలన్నారు. ప్రముఖ రచయిత్రి డాక్టర్ చల్లపల్లి స్వరూప రాణి మాట్లాడుతూ రచయితలు ఎటువైపో తేల్చుకోవాల్సిన పరిస్థితి నేడు ఏర్పడిందన్నారు. పీడితుల పక్షాన అండగా నిలవాలన్నారు. హిందుత్వానికి ప్రతిపక్షంగా నిలబడాలని పిలుపునిచ్చారు. కార్యక్రమంలో జాషువా సాంస్కృతిక వేదిక చైర్మన్ ఎంవిఎస్ శర్మ, కన్వీనర్ పిఎన్ఎం కవి, సాహితీ స్రవంతి అధ్యక్షులు వొరప్రసాద్, ప్రధాన కార్యదర్శి కె. సత్యరంజన్, కెవిపిఎస్ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి అంధ్ర మాల్యాద్రి, కవులు, రచయితలు, అభ్యుదయవాదులు పాల్గొన్నారు. ♦

## 'ఆధునిక సాహిత్య పరిణామ క్రమం' పుస్తకావిష్కరణ

పిల్లా కుమారస్వామి రచించిన 'ఆధునిక సాహిత్య పరిణామ క్రమం', 'రాయలసీమ ఆధునిక సాహిత్య పరిణామ క్రమం' పుస్తకావిష్కరణ సభ కడపలోని సి.పి. బ్రౌన్ గ్రంథాయలయంలో సెప్టెంబర్ 22న జరిగింది. ఈ సభలో ఆచార్య కేతు విశ్వనాథ రెడ్డి ముఖ్య అతిగా పాల్గొని మాట్లాడారు. గురజాడ సాహిత్యంతో తెలుగుభాషలో సాహితీ పునరుజ్జీవన ప్రక్రియ ప్రారంభమైందని అన్నారు. వైవియు లలిత కళల విభాగం ఆచార్యులు డాక్టర్ మూల మల్లికార్జున రెడ్డి పుస్తకాన్ని ఆవిష్కరించి మాట్లాడుతూ రాయలసీమలో మొట్టమొదట ప్రబంధం వచ్చిందని అన్నారు. నవలల్లో కూడా రాయలసీమ వెనుకబడిలేదని అన్నారు. పిల్లా కుమారస్వామి మాట్లాడుతూ దళితుల్ని, స్త్రీలను, పిల్లలను సమదృష్టితో చూసే సాహిత్యమే ఆధునిక సాహిత్యమని అన్నారు. సాహిత్యంలో వచ్చిన వివిధ ధోరణుల కారణంగా ప్రపంచీకరణ వ్యతిరేక సాహిత్య




కడపలో సి.పి. బ్రౌన్ గ్రంథాలయంలో సెప్టెంబర్ 22న జరిగిన 'ఆధునిక సాహిత్య పరిణామక్రమం' పుస్తకావిష్కరణ సభలో ప్రసంగిస్తున్న కేతు విశ్వనాథ రెడ్డి. చిత్రంలో పిల్లా కుమారస్వామి, మూల మల్లిఖార్జున రెడ్డి, ఎ. రఘునాథరెడ్డి.

సృజనలో సాహిత్యకారులు ఐక్యంగా పనిచేయడంలోనే సమాజ ప్రగతికి వారు చోదక శక్తులుగా నిలుస్తారని అన్నారు. సాహితీస్రవంతి రాష్ట్ర కమిటీ సభ్యులు ఎ.రఘునాథ్ రెడ్డి సభకు అధ్యక్షత వహించారు. జిల్లా కమిటీ సభ్యులు వైఎల్ నరసింహులు స్వాగతం పలికారు. ♦



కర్నూలులో సాహితీస్రవంతి ఆధ్వర్యంలో సెప్టెంబర్ 28న జరిగిన జాషువా జయంతి కార్యక్రమం. చిత్రంలో జంధ్యాల రఘుబాబు, ఊదు సుబ్బన్న, మహమ్మద్ హుస్సేన్, దండెబోయిన పార్వతి, జెఎస్సార్కె శర్మ వియోగి, హరిశ్చంద్రారెడ్డి, రాజారెడ్డి, మహేశ్వరయ్య, పటాన్ సుల్తాన్‌ఖాన్, సుధీర్ రాజు తదితరులు




సాహితీస్రవంతి ఆధ్వర్యంలో నంద్యాలలో సెప్టెంబర్ 28న జరిగిన జాషువా జయంతి సభ. చిత్రంలో సాహితీస్రవంతి కన్వీనర్ శ్రీనివాసమూర్తి

## వైజాగ్ ఫెస్ట్ 2017
## కథల, కవితల పోటీ పోస్టర్ విడుదల




వైజాగ్ ఫెస్ట్ 2017 డిసెంబరు 1 నుండి 10 వరకు జరగనున్న సందర్భంగా కాలేజీ విద్యార్థినీ, విద్యార్థులకు, రచయితలకు రెండు విభాగాలుగా కథలు, కవితల పోటీ నిర్వహిస్తున్నట్లు సాహితీస్రవంతి విశాఖ జిల్లా అధ్యక్షులు ఎ.వి. రమణారావు తెలిపారు. అక్టోబర్4న విశాఖపట్నంలోని సీతమ్మధారలో వైజాగ్‌ఫెస్ట్ కార్యాలయంలో ప్రెస్‌మీట్ ఏర్పాటుచేసి పోటీల పోస్టర్‌ను విడుదల చేశారు. ప్రముఖ రచయిత చింతకింది శ్రీనివాసరావు పోస్టర్‌ను విడుదల చేశారు. ఈ కార్రక్రమంలో సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి చీకటి దివాకర్, రచయిత్రి అయ్యగారి సీతారత్నం, విరియాల గౌతమ్, అరసం నాయకులు అనంతరావు, సాహితీస్రవంతి విశాఖపట్నం ప్రధాన కార్యదర్శి నూనెల శ్రీనివాసరావు, నాగరాజు, యువరచయిత్రి పరిమళ తదితరులు పాల్గొన్నారు. ◆



కర్నూలు జిల్లా ఎమ్మిగనూరులో సాహితీస్రవంతి ఆధ్వర్యంలో సెప్టెంబర్ 28న జరిగిన జాషువా జయంతి సందర్భంగా గరగపర్రు, అగిరిపల్లి, దేవరపల్లి తదితర సంఘటనలకు వ్యతిరేకంగా వెలువరించిన కవితా సంకలనం 'నిరసన స్వరాలు' ఆవిష్కరిస్తున్న దృశ్యం. చిత్రంలో పి. మాదన్న, ఎం. నాగమణి,, మల్లెల ఆల్ఫ్రెడ్‌రాజు, శకుంతల, జ్ఞానప్రకాష్, దేవసహాయం తదితరులు

## 'చారాణా' కథల సంపుటి ఆవిష్కరణ



తెలంగాణ సాహితి ఆధ్వర్యంలో "చారాణా" వహీద్‌ఖాన్ కథలు - పుస్తక ఆవిష్కరణ కార్యక్రమం సెప్టెంబర్ 26న హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞానకేంద్రంలో జరిగింది. ఆవిష్కర్త అంపశయ్య నవీన్ మాట్లాడుతూ.. రచయిత వహీదఖాన్ రాసిన కథలు ప్రస్తుత మన సమాజంలో ఉన్న పరిస్థితులను అద్దంలో చూపుతున్నాయని చెప్పారు. కవి యాకూబ్ మాట్లాడుతూ.. "చారాణా" కథల వంటి ముగింపు ఈ రోజు సమాజానికి అవసరం అన్నారు. కులం, మతం అంటూ మానవ విలువలు మంట కలుస్తున్న ఈ తరుణంలో ఒక మనిషి ఎలా బతకాలో ఆదర్శవంతంగా చూయించారని తెలియజేశారు. పుస్తక పరిచయకర్త డాక్టర్ పరిమళ్ మాట్లాడుతూ.. రచయిత పలు అంశాలను, సమస్యలను అభ్యుదయ భావంతో నిశితంగా పరిశీలించారని, ప్రతి కథలో బహుళ అస్తిత్వ, సమస్యలను చర్చించారని చెప్పారు. ఈ కార్యక్రమంలో భూపతి వెంకటేశ్వర్లు అధ్యక్షత వహించగా వక్తలు మోతుకూరి నరహరి, వల్లభాపురం జనార్దన్, రచయిత వహీద్‌ఖాన్‌లు, వివిధ ప్రజాసంఘాల నాయకులు, కవులు, రచయితలు, సాహిత్యాభిమానులు పాల్గొన్నారు. ◆

## సరికొత్తగా సాహిత్య ప్రస్థానం

సాహిత్య ప్రస్థానం 15వ వార్షికోత్సవ సందర్భంగా సరికొత్త శీర్షికలతో మరింత ఆకర్షణీయంగా, ఆలోచనలు పెంచేవిధంగా సాహిత్య ప్రస్థానాన్ని వెలువరించబోతున్నామని తెలియజేయడానికి సంతోషిస్తున్నాం.

* 2018 జనవరి నెల సంచిక నుండి మార్పులతో కూడిన సాహిత్య ప్రస్థానం సంచిక వెలువడుతుంది.
* మంచి రచనలకు, కొత్త ఆలోచనలు రేకెత్తించే సృజనకు ఎప్పటిలాగే సాహిత్య ప్రస్థానం వేదికగా ఉంటుంది.
* సాహిత్య ప్రస్థానం పత్రిక ధర కూడా ఆర్థిక పరిస్థితిని దృష్టిలో పెట్టుకుని పెంచక తప్పట్లేదు. 15 ఏళ్లుగా ఒకే విధంగా రు.10గా వున్న పత్రిక ధరను 2018 జనవరి నుంచి రు.20 కి పెంచడం జరుగుతుంది.
* సాహిత్య ప్రస్థానం పేజీలు 64కు పెంచి, ఆ పేజీలను మరింత విశ్లేషణ కోసమే గాక మూడు మాసాల కొక ప్రత్యేక అధ్యయనం కోసం వినియోగించడం జరుగుతుంది..
* చందాదారుల చందాలను కూడా పెరిగిన ధరకు అనుగుణంగా సర్దుబాటు చేయటం జరుగుతుంది.
* చందాదారులు ఈ మార్పులను గమనించి సహృదయంతో ఎప్పటిలాగానే ప్రోత్సహిస్తారని ఆశిస్తున్నాం.
* పత్రికలో మార్పులు, చేర్పులకు సంబంధించి పాఠకుల నుండి సూచనలు కోరుతున్నాం.

– ఎడిటర్

## కాకినాడలో జాషువా జయంతి సభ



కాకినాడలో గాంధీభవన్‌లో సాహితీస్రవంతి ఆధ్వర్యంలో అక్టోబర్ 1న జరిగిన జాషువా జయంతి సభ. చిత్రంలో గనారా, కోయి కోటేశ్వరరావు, జోశ్యుల కృష్ణబాబు ఉన్నారు.

కాకినాడలో గాంధీభవన్‌లో సాహితీస్రవంతి ఆధ్వర్యంలో అక్టోబర్ 1న జాషువా జయంతి సభ జరిగింది. జోశ్యుల కృష్ణబాబు అధ్యక్షత వహించిన ఈ సభలో ముఖ్య అతిథిగా ప్రముఖ కవి డా॥ కోయి కోటేశ్వరావు హాజరయ్యారు. జాషువా జీవితంలో ఎదురైన సంఘటనల్ని, సాహిత్యంలో జాషువా స్థానాన్ని విశ్లేషిస్తూ ముఖ్య అతిథి ప్రసంగించారు. జాషువా సాహిత్యంపై గరికపాటి మాష్టారు, పద్మజావాణి, రామకృష్ణశ్రీవాత్సలు మాట్లాడారు. కెర్ల పుల్లారావు ఆలపించిన జాషువా స్మశాన పద్యాలు సభికులను ఆకట్టుకున్నాయి. ఈ సభలో సాహితీస్రవంతి పట్టణ అధ్యక్షులు మార్ని జానకిరామ్ చౌదరి, రాష్ట్ర ఉపాధ్యక్షులు గనారా, పద్మావతి, పద్మజావాణి, సలాది సాయిసత్యనారాయణ, ఎమ్.వి.జి. కృష్ణంరాజు తదితరులు పాల్గొన్నారు. ◆

## విజయనగరంలో జాషువా జయంతి సభ



విజయనగరం జిల్లా సాహితీస్రవంతి ఆధ్వర్యంలో సెప్టెంబర్ 28న జరిగిన రాపాక సన్ని విజయకృష్ణ కవితా సంపుటి 'అనివార్యతలోకి' ఆవిష్కరణ సభ. చిత్రంలో కె. ఆదిలక్ష్మి, ఇల్ల ప్రసన్నలక్ష్మి, రాపాక సన్నివిజయకృష్ణ, రొంగలి పోతన్న, మల్లిపురం జగదీష్, చందక గాయత్రీరావు ఉన్నారు.

విజయనగరంలో సాహితీస్రవంతి ఆధ్వర్యంలో సెప్టెంబర్ 28న జాషువా జయంతి సభ జరిగింది. సభాధ్యక్షురాలు కె. ఆదిలక్ష్మి మాట్లాడుతూ ఆధునిక తెలుగు సాహిత్య చరిత్రలో జాషువాది ప్రత్యేకమైన అధ్యాయమని అన్నారు. రాపాక సన్నివిజయకృష్ణ కవిత్వం 'అనివార్యతలోకి' పుస్తకాన్ని శ్రీరంగం పోతన్న ఆవిష్కరించి మాట్లాడుతూ సమాజంలో అసమానతలు ఇంకా తొలగిపోలేదని, జాషువా సాహిత్యం ప్రజల్లోకి తీసుకెళ్ళాలని కోరారు. కవయిత్రి ఇల్ల ప్రసన్నలక్ష్మి, రాపాక సన్నివిజయకృష్ణ, చందక చంద్రికానాయుడు, జి. ఈశ్వరరావు, చీకటి చంద్రికారాణి, మల్లిపురం జగదీష్, చీకటి దివాకర్, ఇనుగంటి జానకి, బి. హైమావతి, బులుసు సరోజినీదేవి, పి.ఎస్.ఎస్. శ్రీనివాసరావు, పాయల మురళీకృష్ణ తదితరులు పాల్గొన్నారు. ◆

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**




# వైజాగ్ ఫెస్ట్ 2017- కథ, కవితల పోటీ

*వైజాగ్ ఫెస్ట్ 2017 డిసెంబర్ 1 నుండి 10 వరకు జరుగుతుంది. ఈ ఉత్సవాల్లో ప్రముఖ ప్రచురణ సంస్థలతో పాటు 200ల పైన బుక్ స్టాల్స్‌తో 10 రోజుల పాటు పుస్తక ప్రదర్శన ఉంటుంది. ఆ సందర్భంగా ఉత్తమ సాహిత్యాన్ని ప్రోత్సహించేందుకై కథలు, కవితల పోటీ నిర్వహించాలని ఆహ్వానసంఘం నిర్ణయించింది. ప్రజా శ్రేయస్సు సామాజిక చైతన్యం కోరే రెండు తెలుగు రాష్ట్రాల రచయితలు కవులూ ఈ పోటీలలో పాల్గొని ఉత్తేజకరమైన రచనలు పంపి ఈ ప్రయత్నం జయప్రదం చేయాలని కోరుతున్నాము. నేటి సామాజిక సవాళ్లకు తగిన స్థాయిలో మంచి రచనలను ఆహ్వానిస్తున్నాం. ఈ ప్రయత్నాన్ని ఫలప్రదం చేసి, చిరస్మరణీయ రచనలు అందించవలసిందిగా రచయితలను కోరుతున్నాం. కథల విభాగంలో మొదటి బహుమతి రూ. 8,000/-లు, రెండవ బహుమతి రూ. 5,000/-లు, మూడవ బహుమతి రూ. 3,000/-లు, కవితల విభాగంలో మొదటి బహుమతి రూ. 5,000/-లు, రెండవ బహుమతి రూ. 3,000/-లు, మూడవ బహుమతి రూ. 2,000/-లు.*

## ఉత్తరాంధ్ర జిల్లాల కాలేజీ విద్యార్థినీ విద్యార్థులకు కథ, కవితల పోటీ

*శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం జిల్లాలో ఇంటర్, డిగ్రీ, పాలిటెక్నిక్, ఇంజనీరింగ్, మెడిసన్ చదువుతున్న విద్యార్థినీ విద్యార్థులకు వేరుగా కథ, కవితల పోటీ ఉంటుంది. వారు 'తమ కళాశాల విద్యార్థి' అని నిర్ధారిస్తూ కళాశాల యాజమాన్యం ధృవపత్రం తప్పని సరిగా జతచేయాలి. ఆయా కాలేజీ యాజమాన్యాలు ఈ కార్యక్రమాన్ని విజయవంతం చేయడానికి సహకరించవలసిందిగా ఆహ్వానసంఘం కోరుతున్నది. కథల విభాగంలో మొదటి బహుమతి రూ. 5,000/-లు, రెండవ బహుమతి రూ. 3,000/-లు, మూడవ బహుమతి రూ. 2,000/-లు, కవితల విభాగంలో మొదటి బహుమతి రూ. 3,000/-లు, రెండవ బహుమతి రూ. 2,000/-లు, మూడవ బహుమతి రూ. 1,000/-లు.*

## నియమ నిబంధనలు:

1. కథ ఎ4 సైజు కాగితంపై చేతిరాతలో 8 పేజీలు, డి.టి.పి. 15 సైజు ఫాంట్‌లో ఎ4 సైజులో 5 పేజీలకు మించకూడదు.
2. డి.టి.పి. చేసిన వాటిని పిడిఎఫ్, ఓపెన్ ఫైల్ రెండూ పంపించాలి.
3. మరీ సుదీర్ఘ కవితలు పంపవద్దు. ఒక కవి ఒక కవిత మాత్రమే పంపించాలి.
4. ఇటీవలి ప్రపంచీకరణ విధానాల నేపథ్యంలో ప్రజల జీవితాలలో వస్తున్న మార్పులకు సంబంధించిన అంశాల్ని ఇతివృత్తంగా స్వీకరించవచ్చు. ఇతివృత్తంతో పాటు రచనా శిల్పానికి ప్రాధాన్యత ఉంటుంది.
5. అచ్చయినవి, అనుకరణలు, అనువాదాలు పోటీకి అనర్హం. ఆ మేరకు హామీపత్రం రాయాలి.
6. గ్రామీణ జీవితం, మహిళలు, అణగారిన తరగతుల గురించి సజీవ చిత్రణలకు స్వాగతం. సామాజిక సమస్యలు, సమకాలీన సమస్యలను కూడా ఇతివృత్తాలుగా తీసుకోవచ్చు.
7. రచనలపై రచయిత, రచయిత్రులు తమ పేర్లు రాయకూడదు. హామీ పత్రంలో మాత్రమే పేరు, చిరునామా, ఫోన్ నెంబరు, ఇమెయిల్ వివరాలు రాయాలి.
8. ఫలితాలకు సంబంధించి న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం. ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు.
9. పోటీకి అందిన కథలు, కవితలలో గెలుపొందిన వాటితో పాటు, సాధారణ ప్రచురణకు ఎంపిక చేసిన వాటితో కథ, కవితా సంకలనాలను ప్రచురించడం జరుగుతుంది.
10. కవరుపై కథ, కవితల పోటీకి అని రాసి రచనలను ఈ దిగువ చిరునామాకు పంపించాలి. చీకటి దివాకర్, ఇంటినెం. 1-17/1, ఫ్లాట్ నెం. 84, ఆదిత్యానగర్, కంటోన్మెంట్, విజయనగరం-535 003. ఈమెయిల్ cheekatid9@gmail.com ద్వారా కూడా పంపించవచ్చు. **రచనలు చేరవలసిన చివరి తేది : 10 నవంబర్ - 2017.**

*విశాఖపట్నంలో 2017 డిసెంబరు 1 నుండి 10 వరకు జరిగే వైజాగ్ ఫెస్ట్ ప్రాంగణంలో బహుమతులు అందజేయడం జరుగుతుంది. వివరాలకు 94411 76882, 98487 10507, 87904 08525 నెంబర్ల ద్వారా సంప్రదించగలరు.*

51

**- చీకటి దివాకర్**

కన్వీనర్, గురజాడ సాహిత్య వేదిక, ఆహ్వాన సంఘం, వైజాగ్ ఫెస్ట్ - 2017

SHAITYA PRASTHANAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.VJ/187/2017-19
Date of Posting : 10.10.2017 ▪ Date of Publication: 05.10.2017

PRSVIMORA185

# ప్రజాశక్తి బుక్‌హౌస్ తాజా ప్రచురణలు

## వేమన సాహిత్యంపై 14 ప్రామాణిక గ్రంథాలు













































ప్రస్థానం పాఠకులకు ప్రత్యేక తగ్గింపు

ప్రతులకు : ప్రజాశక్తి బుక్‌హౌస్ 27-1-64, కారల్‌మార్క్స్‌రోడ్, విజయవాడ. ఫోన్: 0866-2577533

If Un delivered please return to: Prasthanam, C/o M.B. Vignana kendram, 27-30-4, 3rd Floor
Akulavari veedhi, Governorpet, Vijayawada - 520002. Ph: 0866-2577248, Cell: 9490099059



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVMO2A185 |
| పుస్తకం పేరు | [illegible] NO |
| తారీఖు | 25/5/14 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Gayatri |
| పేజీలు విడదీసినది | Gayatri |
| స్కాన్ చేసినది | L.Naveen |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |